


Your favourite comics, contributed by a child!

This special issue with more pages of fun for Rs.12/-

**FROM KIDS, FOR KIDS**
**DON'T MISS CHANDAMAMA'S CHILDREN'S SPECIAL ISSUE!**

**A SPARKLER TO LIGHT UP YOUR DIWALI!**

చందమామ

సంపుటి 109 అక్టోబర్ 2003 సంచిక:4

## ఈ నెల విశేషాలు



మాయాసరోవరం

13



వడ్డీకాసుల చెట్టు

19



ఒంటింటి బిచ్చగాడు

35



దండాల రాముడు

40

## ఈ సంచికలో ...



**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**

***Remittances in favour of Chandmama India Ltd.***
to

Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# కొనితెచ్చుకుంటూన్న ప్రమాదం!

నిత్యజీవితం సులభం, సుఖతరం కావడానికి వీలుగా ఇవాళ ఎన్నో ఆధునిక సదుపాయాలు వచ్చాయి. నిన్న మొన్నటిదాకా లేని వాహనాలు, టెలిఫోన్లు, మొబైల్ ఫోన్లు, ఫ్యాక్స్, ఇ.మెయిల్ సదుపాయాలు ఈ రోజు మనకు అందుబాటులో ఉన్నాయి. వీటి కారణంగా సమయం బాగా ఆదా అయి, జీవితాలు చాలినంత తీరికతో నింపాదిగా సాగాలి. అయితే , వాస్తవంలో అలా లేదు. ప్రతి విషయంలోనూ మునుపటికన్నా వేగం, తొందర, హడావుడి పెరిగి పోయాయి. సమయాభావంతో మనిషి సతమతమైపోవడం విచిత్రం! ఈ హడావుడిలో చాలామందికి వండుకుని తినే సమయం కూడా ఉండడం లేదు. ఇంతవరకు హోటళ్ళకే పరిమితమైనవారు ఇవాళ ఫాస్ట్ ఫుడ్స్ మీదికి ఎగబడుతున్నారు. పాశ్చాత్య దేశాల నుంచి ఈ ఫాస్ట్ ఫుడ్స్ అలవాటు మనకు అధిక ఖర్చుతో పాటు అనేక ఆరోగ్య సమస్యలను కూడా తెచ్చిపెడుతున్నది.

ఈ విషయంలో శాన్ ఫ్రాన్సిస్కోలోని 'ఫుడ్ అండ్ సొసైటీ పాలిసీ' ఫెలో మైకేల్ మాస్కరన్ హాస్ ఇలా హెచ్చరిస్తున్నాడు: అమెరికాలో పెరుగుతూన్న అతిబరువు సమస్య అందరికీ తెలిసినదే. మాంసం, వెస్టర్న్ ఫాస్ట్ ఫుడ్స్, శీతలపానీయాలు మొదలైన వాటిని ఇక్కడి నుంచి ఇండియాకు ఎగుమతి చేయడం ద్వారా, అక్కడ మరిన్ని ప్రజా ఆరోగ్య సమస్యలు తలెత్తనున్నాయి. ఆకలిని నిర్మూలించడమా? అతి బరువును తగ్గించడమా? దేనికి ప్రాధాన్యత నివ్వాలి? అని ఇండియా నిర్ణయించుకోవలసి ఉంటుంది.

వైవిధ్య భరితమైన సంస్కృతీ సంప్రదాయాలూ, విభిన్న వ్యావసాయిక ప్రాంతాలూ గల భారతదేశంలో స్థానికంగా లభించే ఆహారపదార్థాలతో ఆరోగ్యకరమైన ఆహారాలను సులభంగా తయారు చేసుకోవచ్చు- అని కూడా ఆయన సూచిస్తున్నాడు.

ఈ ఫాస్ట్ ఫుడ్స్, శీతలపానీయాలు అనేవి మనం చేజేతులా కొనితెచ్చుకుంటూన్న ప్రమాదం అని గ్రహించాలి. ఇవి మొదట పిల్లల్ని బాధిస్తుంది. మన దేశాన్ని ముంచెత్తే మరొక ప్రమాదంగా అవి రూపుదాల్చకముందే-తల్లిదండ్రులు ఈ విషయంలో తగు జాగ్రత్తలు తీసుకోవడం శ్రేయస్కరం!

సంపాదకుడు : విశ్వం





# Junior
CHANDAMAMA

**RESERVE YOUR COPY NOW!**



Do you want your children to sharpen their faculties by working on puzzles?
**Come to Junior Chandamama for loads of puzzles and games.**



Are you looking out for interesting new stories to be read out to the kiddies?
**Pick up a copy of Junior Chandamama, and you'll find them there.**



Does your child have a taste for colouring and you want to develop the habit?
**Junior Chandamama is what you must get for your child.**



Want your kid to learn all about the culture and heritage of India?
**Only Junior Chandamama can help you.**

**PAGE AFTER PAGE WILL KINDLE YOUR CHILD'S IMAGINATION**

**ISSUE AFTER ISSUE, MONTH AFTER MONTH**




## SUBSCRIPTION FORM

Please enrol me as a subscriber of *Junior Chandamama*. I give below the required particulars:

Name : ..........................................

Address : ......................................

..................................................

..................................................

PIN Code : ....................................

I am remitting the amount of Rs.120/- for 12 issues by Money Order/Demand Draft/Cheque No......................
on...................................... Bank
...................................... branch
drawn in favour of Chandamama India Ltd., encashable at Chennai (outstation cheque to include Rs.25/- towards Bank Commission).

Place : ....................

Date : .................... Signature



# గజరాజు తీర్పు

మహాసముద్రం మధ్య గల ఒకానొక దీవి అడవులతో, కొండలతో, జలపాతాలతో నిండి వుండేది. అక్కడ ఎన్నో ఘాతుక మృగాలూ, సాధుజంతువులూ తప్ప మనుషులు మాత్రం లేరు. దీవిలోని జంతువులన్నీ కలిసి ఇరావతం అనే ఒక ఏనుగును తమ రాజుగా నియమించుకున్నవి.

ఈ ఇరావతం బలదర్పాల్లో, వివేకంలో తనకదే సాటి. న్యాయనిర్ణయంలో తమ రాజుకు సాటి రాగలవారు మరి లేరని జంతువులన్నీ చెప్పుకునేవి. ఇరావతం ప్రతి రోజూ సాయంత్రం సముద్రం ఒడ్డున సభ ఏర్పాటు చేసి, దీవిలో వున్న జంతువుల మధ్య తలఎత్తే చిన్నా పెద్ద తగాదాలను, సునిశితంగా పరిశీలించి, లోకరీతికి భంగం కలగకుండా చక్కగా పరిష్కరించేది.

దీవిని చుట్టివున్న సముద్ర జలంలో, ఒక జలకన్య వుండేది. నడుం కింది భాగం చేప ఆకారం, నడుం పై భాగం స్త్రీ ఆకారంతో వుండడంతో, అది సముద్రం ఒడ్డున తిరుగుతూ, జంతువులతో స్నేహంగా మెలుగుతూ, అప్పుడప్పుడు ఏనుగుల రాజు చెప్పే తీర్పులు వినడానికి వచ్చేది.

ఒకనాటి సాయంకాలం సభ జరుగుతుండగా, రెండు తోడేళ్ళు గాయాలతో వున్న ఒక గొర్రెపిల్లను తీసుకువచ్చి ఏనుగు ముందు పెట్టాయి. ఇరావతం గొర్రె పిల్లకేసి జాలిగా చూసి, ''ఏమిటి మీ ఇద్దరి మధ్యా వచ్చిన తగవు?'' అని ప్రశ్నించింది.

అందుకు కాస్త నలుపు రంగులోవున్న తోడేలు, ''రాజా! ఈ గొర్రెపిల్లను వేటాడింది, నేను. ఇది నాకు చెందాలి!'' అన్నది.

''రాజా! ఈ గొర్రెపిల్ల ఆ మందలో తల్లి దగ్గర వున్నది. రాత్రి కటిక చీకటివేళ కాపుకాసి, గొర్రెలా నటిస్తూ దీన్ని తల్లి నుంచి వేరు చేసి బయటకు తెచ్చాను. ఆ సమయంలో హఠాత్తుగా వచ్చి దాని మీద పడి గాయపరిచిన ఈ మాయావి, తను వేటాడానంటున్నది!'' అన్నది కాస్త బూడిద రంగులో వున్న తోడేలు.

గుడిసేవ మురళీధర్

ఇరావతం వాటిని గట్టిగా మందలించి, బూడిదరంగు తోడేలుతో, ''నువ్వు చీకటిలో గొర్రెలా నటిస్తూ గొర్రెపిల్లను పట్టిన తీరు తోడేలుజాతి స్వభావానికే విరుద్ధం, తలవంపులు! నీకు వారం రోజులపాటు చీకటి గుహలో కఠిన శిక్ష విధిస్తున్నాను!'' అన్నది.

ఆ తరవాత అప్పుడు ఇరావతం తలతిప్పి సభాసదులకేసి ఒకసారి చూసి, తోడేలుతో, ''తల్లి నుంచి వేరుపడి భయంతో విలవిల లాడుతున్న గొర్రెపిల్లను నువ్వు వేటాడిన తీరు, నువ్వు పుట్టిన వంశానికే అవమానకరం. గొర్రెపిల్లను దాన్ని మందలో వున్న తల్లి దగ్గరకు చేర్చడం నీ బాధ్యత. ఇందులో పిసరంత పొరపాటు జరిగినా, నిన్ను యావ జ్జీవం గుహలో బంధించగలను,'' అన్నది.

ఈ జరిగిందంతా సముద్రపు ఒడ్డు రాతి గుట్ట మీద కూర్చుని, శ్రద్ధగా విన్న జలకన్య లేచి, ఇరావత రాజుకు నమస్కరించి, ''గజరాజా! మీ తీర్పును అడవి జంతువులన్నీ ఆనందంగా ఆమోదించాయి. అయినా, నాకు ఒక అనుమానం!'' అన్నది. ''ఏమిటది?'' అని అడిగింది ఇరావతం.

''గొర్రెపిల్ల నాకే చెందాలి అని దానిని వేటాడిన రెండు తోడేళ్ళు వస్తే, అది రెండిం టికీ చెందదని తీర్పునిచ్చావు. బలమైన జంతు వులు బలహీనమైన జంతువులను వేటా డటం ప్రకృతిసహజం కదా! అలాంటప్పుడు తోడేళ్ళు గొర్రెపిల్లను వేటాడడం తప్పెలా అవుతుంది?'' అని అడిగింది జలకన్య.

అందుకు ఇరావతం, ''వేటాడడం వన్య మృగాలకు సహజమే. అయితే ఆ హక్కు అడవి వరకే పరిమితం. అడవి హద్దులను దాటి జన నివాస స్థానాలలో జొరబడి సాధుజంతువులను వేటాడడం అనేక సమస్యలకు దారితీస్తుంది. అది చివరకు వన్యమృగాలకే హాని కలిగిస్తుంది. ఎందుకంటే వన్యమృగాల బెడదను తుద ముట్టించటానికి మనుషులు పూనుకుంటే ఆపైన అడవి జంతువులు బతకలేవు. అందుకే హద్దులు ఎరిగి మసలుకోవటం అందరికీ క్షేమం అని ఆ తీర్పునిచ్చాను,'' అన్నది.

ఆ వివరణ విని జలకన్య, ''గజరాజా! మీ బుద్ధికౌశలం అమోఘం!'' అంటూ ఏనుగుకు మరొక్కసారి నమస్కరించి సముద్రంలోకి వెళ్ళిపోయింది.





# మిత్రుడు - శత్రువు

రాజుగారి కొలువులో ఉన్నత పదవిలో వున్న మహానందుడు అహంకారి. ఆయన ఒక రోజున మిట్టమధ్యాహ్నం మండుటెండలో రాజ మార్గంలో నడుస్తూండగా, కాలిచెప్పు ఉంగరం తెగిపోయింది. అది సరిచేసు కుందామని బాట పక్కన ఉన్న చెట్టు నీడకు చేరాడు. ఆ సమయానికి ఆ చెట్టు కింద వినోదుడనే పేదవాడున్నాడు. వాడూ, మహా నందుడూ బాల్యమిత్రులు. విద్యారంభంలో ఒకే గురువు వద్ద కొంతకాలం చదువు కున్నారు. ఆ తర్వాత మహానందుడికి దశ తిరిగింది. వినోదుడింట్లో కష్టాలు కాపురం పెట్టాయి. చాలాకాలంగా వాళ్ళిద్దరూ కలుసుకోవడం జరగలేదు.

"రా, మిత్రమా! నిన్ను చూసి చాలా కాలమైంది," అన్నాడు వినోదుడు నవ్వుతూ. చిన్న కట్టు ధోవతీ, ఒంటిమీద చిన్న అంగవస్త్రం తప్ప ఏమీ లేని వినోదుడు, తనను మిత్రమా అనడం సహించలేక, "ఏయ్! ఎవరు నువ్వు? ఒక ఉన్నత రాజోద్యోగిని మిత్రమా అని పిలుస్తున్నావు! నీ కంత ధైర్యం ఎలా వచ్చింది?" అన్నాడు మహానందుడు ఈసడింపుగా.

వినోదుడు గనక తమ బాల్య స్నేహం గురించిన ప్రస్తావన తెస్తే, వాడినింకా ఈసడిం చాలని, మహానందుడనుకున్నాడు.

కానీ వినోదుడు, "ఒకే చెట్టు మన ఇద్దరికీ నీడనిచ్చింది. అందుకని మిత్రమా అని పిలిచాను," అన్నాడు ఇంకా నవ్వుతూనే.

"స్నేహానికి దారి చూపేది చెట్టు నీడ కాదు, కట్టుబట్ట. ఒకసారి నా బట్టలు చూడు, నీ బట్టలు చూసుకో," అన్నాడు మహా నందుడు ఎగతాళిగా.

దానికి వినోదుడు చిరునవ్వుతో, "ఇంటికి వెళితే నీవైనా అంగవస్త్రమే కప్పుకుంటావు. ఈ ఎండలంతగా మండిపోతున్నాయి. పాపం నీకు, బయట నా లాగా బట్టలు కట్టుకునే స్వేచ్ఛ లేదు. అందుకే ఉక్కబోసి

రాయపరపు ఆదినారాయణరావు



చెమటలు కారుతున్న ఒంటిని పట్టుబట్ట లతో కప్పావు. ఆ కారణం వల్లే నాకు నీ మీద జాలి పుట్టింది. మరి జాలి మిత్రుల మీదనేకదా పుడుతుంది! మిత్రమా అన్న కారణం అది,'' అన్నాడు.

మహానందుడికి ఉక్రోషం వచ్చింది. ''ఈ కబుర్లకేంగానీ, నీవు నాలా రోజూ పంచభక్ష్య పరమాన్నాలు తినగలవా?'' అని అడిగాడు.

''రోజూ తింటే పరమాన్నమూ మామూలు అన్నంలాగే ఉంటుంది. అందుకే మన వాళ్ళు పిండివంటలు పండుగ రోజుల్లోనో, వేడుక సమయాల్లోనో చేసుకోమన్నారు. నేను అప్పుడప్పుడూ పంచభక్ష్య పరమాన్నాలు తింటాను. అందువల్ల నాకవి పంచభక్ష్య పరమాన్నాల్లాగే ఎంతో తృప్తినిస్తాయి. నీకెప్పుడైనా పిండి వంటల రుచి ప్రత్యేకంగా అనిపించిందా?'' అన్నాడు వినోదుడు.

ఈ ప్రశ్నతో మహానందుడికి పట్టరాని కోపం వచ్చింది. అతడు చరచరా రెండో కాలి చెప్పును కూడా చేత్తో పట్టుకుని ఎండలోకి వెళ్ళగానే, కాళ్ళకు నేల చుర్రుమని తగి లింది. వెంటనే నీడలోకి వచ్చేశాడు.

వినోదుడు రెండు చేతులతోనూ చప్పట్లు కొడుతూ, ''ఆహా, ఈ దృశ్యం మరింత మనోహరంగా ఉంది మిత్రమా. మననెవరైతే మోస్తారో, వాళ్ళను మనమూ ఏదో ఒక రోజున మోయాల్సి ఉంటుందని గురువుగారు చిన్నప్పుడు చెప్పారు. ఇన్నాళ్ళూ చెప్పులు నిన్ను మోశాయి. ఈ రోజు నువ్వు చెప్పుల్ని మోస్తున్నావు మిత్రమా,'' అన్నాడు.

మహానందుడిక అక్కడ వుండలేక, కాళ్ళు చుర్రుమంటున్నా లెక్క చేయకుండా వెళ్ళి పోయాడు. తర్వాత ఇల్లు చేరుకుని, చెప్పుల జత మార్చుకుని కొలువుకు వెళ్ళాడు. అక్కడ రాజగుప్తుడు కనబడి, ''మిత్రమా! ఈ రోజెంతో సుదినం,'' అన్నాడు సంతోషంగా.

ఈ రాజగుప్తుడు కూడా మహానందుడి బాల్యమిత్రుడు. వారిద్దరూ వినోదుడితో కలిసి మొదట్లో ఒకే గురువు వద్ద చదువు కున్నారు. రాజగుప్తుడు కలిగిన ఇంట పుట్టి భోగభాగ్యాలతో పెరిగాడు. అందువల్ల ఆయన దూర ప్రాంతాలకు వెళ్ళి గొప్ప గొప్ప చదువులు చదివి తిరిగి వచ్చి, రాజు కొలువులో ఉన్నత పదవిని సంపాదించాడు. ఆయన, మహానందుడు రాజుకొలువు లోనే మళ్ళీ కలుసుకున్నారు. మహానందు డికి రాజగుప్తుడు పైఅధికారి. అయినా ఆయన ఏమాత్రం దురుసుగా ప్రవర్తించక, తమ బాల్యస్నేహాన్ని పురస్కరించుకుని,

మహానందుడితో ఎంతో ఆప్యాయంగా మాట్లాడతాడు.

"నీకు సుదినమైతే, నాకూ సుదినమే. మరి కారణం చెప్పు!" అన్నాడు మహానందుడు

'నేనిచ్చిన ఒక సలహా బాగా మేలు చేసిందని మహారాజు మహోత్సాహపడిపోయి, నన్నేదైనా మంచి కోరిక కోరుకోమన్నాడు. నేను వెంటనే మన బాల్యమిత్రుడు వినోదుడికి కొలువులో ఏదైనా పని ఇప్పించమని అడిగాను. ఆయన వెంటనే ఒప్పుకున్నాడు," అన్నాడు రాజగుప్తుడు.

మహానందుడు తెల్లబోయి, "ఆ పొగరుబోతుకు రాజు కొలువా? వద్దు మిత్రమా! వినోదుడు రాజు కొలువులో చేరితే, నీకు చెడ్డపేరు వస్తుంది," అన్నాడు.

"వినోదుడు పొగరుబోతా! భలేవాడివే. వాడెంతో మర్యాదస్థుడని చిన్నప్పుడనుకునే వాళ్ళం గదా, మరిచిపోయావా?" అని ప్రశ్నించాడు రాజగుప్తుడు.

"ఈ మధ్య ఎప్పుడైనా వాణ్ణి చూసివుంటే, అలాగనవు," అన్నాడు మహానందుడు.

ఇందుకు రాజగుప్తుడు ఆశ్చర్యపోయి, "ఈమధ్యనే రెండు రోజుల క్రితం వాణ్ణి, రాజమార్గంలో బాట పక్కన ఒక చెట్టు నీడలో కలుసుకున్నాను. వాడే నన్ను గుర్తుపట్టి పలకరించాడు. మేమిద్దరం చిన్ననాటి కబుర్లెన్నో చెప్పుకున్నాం. నేను ధరించిన పట్టుబట్టల్ని మెచ్చుకున్నాడు. చలివేస్తే కప్పుకునేందుకు కంబళి, ఎండలో నడవడానికి కాలిచెప్పులు, ఒంటి మీదికి సరైన బట్టా కొనుక్కునే పాటి ఆదాయం తనకు లేదని బాధపడ్డాడు. తానెలా ఉన్నప్పటికీ, నేను రాజు కొలువులో గొప్ప పదవిలో వుండడం, తనకు సంతోషం కలిగిస్తున్నదన్నాడు. నన్ను సాయమడగ



లేదు. నా గురించి అసూయ పడలేదు. వాడు నిజంగా ఉత్తముడు. రాజుగారి కొలువులో వాడికి పని ఇప్పిస్తే నాకు మంచిపేరు తెస్తాడనే నా నమ్మకం!'' అన్నాడు.

ఇది విన్నాక మహానందుడికి మండి పోయింది. అతడు పైకి ఏమీ అనకుండా అప్పటికి ఉగ్గపట్టుకున్నాడు.

సాయంత్రం వెతుక్కుంటూ వినోదుడి ఇంటికి వెళ్ళి, ''నీ బుద్ధి ఏమాత్రం మంచిది కాదు. నన్నేమో అన్నింటికీ చిన్నబుచ్చావు. నా పైఅధికారి రాజగుప్తుడిలో అవే లక్షణాలను ఆకాశానికెత్తి పొగిడావు. ఇలాంటి వాడివనే పెద్దమ్మ నీ ఇంట్లో తిష్ఠ వేసి కూర్చుంది,'' అంటూ వినోదుణ్ణి నానా మాటలూ అన్నాడు.

వినోదుడతణ్ణి పూర్తిగా మాట్లాడనిచ్చి, ''నేను రాజగుప్తుణ్ణి మిత్రమా అనగానే వాడు నన్ను మిత్రుడిగా గుర్తించాడు. నా మిత్రుడు గొప్పగా వుంటే నాకు సంతోషం. నేను వాణ్ణి చూసి గర్వపడ్డాను. నేను నిన్ను మిత్రమా అని పిలిచాను. నువ్వు నన్ను శత్రువులా ఈసడించావు. నా శత్రువును చిన్నబుచ్చడమే, నాకు సంతోషం. నా ప్రవర్తన మానవ సహజంగానే ఉన్నదికదా!'' అన్నాడు.

''అదేం కాదు, రాజగుప్తుడు నాకంటే పై అధికారి కాబట్టి, వాణ్ణి మంచి చేసుకోవాలను కున్నావు. అందుకే వాడిప్పుడు నీకు రాజు కొలువులో మంచిపని ఇప్పించబోతున్నాడు,'' అన్నాడు మహానందుడు.

వినోదుడికీ విషయం తెలియదు. అందువల్ల, ముందు ఆశ్చర్యపడ్డాడు. తర్వాత నెమ్మదిగా, ''నా పరిస్థితి చూసి జాలిపడి, అడక్కుండా సాయపడాలనుకున్నాడు, రాజగుప్తుడు. వాడు నేనూహించిన దానికంటే గొప్పవాడు,'' అని అతడు మాట పూర్తి చేయకముందే, రాజ గుప్తుడు గుమ్మంలోంచి లోపలికి అడుగు పెడుతూ, ''మీ మాటలన్నీ విన్నాను. బాల్య మిత్రుడికి మేలు జరుగుతూ వుంటే చూసి సంతోషించడానికి బదులు, పనిగట్టుకుని నిందించటానికి వచ్చావు! ఇది చేయ కూడని పని అని నీకు సిగ్గు కలగడంలేదా?'' అని ప్రశ్నించాడు మహానందుణ్ణి.

అప్పటికి మహానందుడికి తనలోని నైచ్యం, లోపం తెలియవచ్చాయి. ఆ రోజు నుంచి అతడు తన అహంకారాన్ని విడనాడే ప్రయత్నం చేసి, త్వరలోనే తన మిత్రులకే కాక, శత్రువులకు కూడా మిత్రుడిలా ప్రవర్తించసాగాడు.





# మాయాసరోవరం

## 21

[మాయాసరోవరంకేసి పోతున్న కుంటిమంగళవర్మకు, చెట్టుకొమ్మల్లో చిక్కుకుపోయిన రథం తోలేవాడు కనిపించాడు. వాడి ఆర్తనాదాలు విని సిద్ధసాధకుడూ, రాజు కనకాక్షుడూ అక్కడికి వచ్చారు. ఆ సమయంలో జలవృకుల్ని ఉసికొల్పుతూ, ఖడ్గమృగం మీద ఎక్కి ఉన్న వాడొకడు రావటంతో, చెట్టు మీద నుంచి నరవానరం వాడి మీదికి దూకంది. తరవాత –]

జలవృకులు తమ నాయకుడికి రానున్న ప్రమాదాన్ని చూస్తూనే గుంపుగా వచ్చి, తమ గదలతో నరవానరాన్ని ఎడా పెడా కొట్టసాగారు. సిద్ధసాధకుడు శూలం పైకెత్తి, ''జై... మహా కాళా!'' అంటూ ముందుకు దూకి, జలవృకుల్ని పొడవసాగాడు.

ఈ విధంగా భయంకరమైనపోరాటంరెండు, మూడు నిముషాల కాలం జరిగేంతలో నర వానరం రాతిగదల దెబ్బలు బలంగా తగలటంతో సొమ్మసిల్లి ఖడ్గమృగం మీది నుంచి కిందికి పడిపోయింది. ఆ వెంటనే జలవృకుల నాయకుడు తన వాహనాన్ని చుట్టుముట్టిన సైనికుల నుంచి ముందుకు దూకించి, గదను పైకెత్తి, ''ఒరే, మానవాధము లారా, నేనెవరనుకున్నారు? మాయాసరో వరానికి సర్వాధిపతియైన జలవృకనాథుణ్ణి! ఇప్పుడే పోయి, నాకు బందీలుగా దొరికిన వాళ్ళలో పద్మముఖి అనే కన్యను మాత్రం వదిలి, తతిమ్మావాళ్ళనందర్నీ, నా రాతిగదకు బలి ఇవ్వబోతున్నాను,'' అన్నాడు.



రాతిగదను దాని తల మీద ఆనించి, ''నరవానరా, నీ రాచ్చిప్పతల బద్దలవబో తున్నది!'' అంటూ అరిచాడు.

ఆ మరుక్షణం నరవానరం బిళ్ళం గోడులా ఎగిరి గంతేసి నిలబడి, భయంకరంగా అరుస్తూ, జలవృకభటుణ్ణి రెండు చేతులతో పట్టుకుని, ఎత్తి విసిరివేసింది. వాడు నేల మీద పడేలోపలే కొందరు సైనికుల వాణ్ణి పట్టుకున్నారు.

నరవానరం మరొకసారి జలవృక భటుడి మీదికి పోబోయేంతలో, సిద్ధసాధకుడు శూలం అడ్డం పెట్టి ఆపి, ''ఇక శాంతించు, నరవానరా! మీ ఇద్దరూ నా సేవకులే, పోట్లాడకండి,'' అని, జలరాక్షసుల నాయకుడు ఖడ్గమృగం మీద పారిపోయిన మైపుకు చూసి, ''ఇక ఆ దుర్మార్గుణ్ణి పట్టటం ఎలా? వాడు మాయాసరోవరం చేరినట్టేనా? అదెంత దూరంలో ఉన్నది?'' అన్నాడు.

నరవానరానికి ఇంకా స్పృహ రాలేదు. అది చేతుల్ని అటూ ఇటూ తిప్పుతూ, గట్టిగా పళ్ళు కొరుకుతున్నది. దానికి స్పృహతెప్పించడం తన భటుడైన జలవృకుడికొక్కడికే సాధ్యం అనుకుంటూ సిద్ధసాధకుడు తల తిప్పి, ''ఒరే, వృకభటా, ఎక్కడ? నువ్వూ, నీ పాత నేస్తగాళ్ళతో పారిపోలేదు గదా!'' అన్నాడు.

ఆ వెంటనే జలవృకుడు ముందుకు వచ్చి, సిద్ధసాధకుడికిసాగిలపడి లేచి, ''దొరా, జలవృక రాక్షసుల స్వామిభక్తి ముందు పుట్టు బానిసలు కూడా దిగదుడుపే! జలవృకుడు మాట తప్పడు, ఏం సెలవు?'' అన్నాడు.

''ఒరే, వృకభటా, నరవానరానికి తగిలిన రాతిగద దెబ్బలు ప్రాణాపాయం కలిగించే వనుకోను. దాన్ని ఎత్తి, కాళ్ళమీద నిలబెట్టు,'' అన్నాడు సిద్ధసాధకుడు.

జలవృకభటుడు, నరవానరాన్ని సమీపించి, ఎడమచేత్తో దానిగొంతు గట్టిగా పట్టుకుని,

వైద్యదేవుడని పిలవబడే దేవశర్మ అతణ్ణి సమీపించి, ''సాధకా, ఆ మాయాసరోవరం ఇక్కడికి మరెంతో దూరాన లేదు. అందరూ నావెంట కదలండి,'' అన్నాడు.

సిద్ధసాధకుడు అంగీకార సూచకంగా తల ఊపాడు. దేవశర్మముందుండిదారితీయగా అందరూ కదిలారు. రాజు కనకాక్షుడు అతడి పక్కనే నడుస్తూ, ''శర్మా! ఆ జలరాక్షసుడు పద్మముఖి అనే కన్యనొక్కదాన్ని మాత్రం ప్రాణాలతో వదులుతానంటున్నాడు. అందు క్కారణం ఏమిటో నాకర్థం కాలేదు,'' అన్నాడు.

''మహారాజా, మాయాసరోవరం పూర్తిగా జల రాక్షసుల స్వాధీనమైపోయినట్టు తెలుస్తున్నది. పద్మముఖి మాయాసరోవరేశ్వరుడి

కుమార్తె. ఆ జలరాక్షసుల నాయకుడు ఆమెను చంపననటంలో మరేం విశేషం లేదు; వాడికొక కొడుకున్నాడు - అదీ సంగతి!'' అన్నాడు దేవశర్మ.

''నా కుమార్తె కాంచనమాలను కూడా మరొక జలరాక్షసుడు వివాహమాడ ప్రయత్నించవచ్చు!'' అంటూ రాజు కనకాక్షుడు ఉద్రేక పడిపోయాడు.

''మహారాజా, మీరు అనవసర భయానికి లోనుకాకండి. ఆ మాయాసరోవరంకేసి మహాసత్వుడైన జయశీలుడూ, సరోవరేశ్వరుడూ ఎప్పుడో వెళ్ళారు,'' అన్నాడు దేవశర్మ.

దేవశర్మ, రాజు కనకాక్షుడికి ఇలా ధైర్యం చెబుతున్న సమయంలోనే జయశీలుడు మిగతా వాళ్ళతో కలిసి మాయాసరోవరాన్ని చేరాడు. ఆ సరోవరం అతి విశాలమైనది. దాని చుట్టూ కొండలూ, నీటి అంచు వరకూ పరుచుకుపోయిన మహారణ్యం వున్నది.

జయశీలుడు సరోవరం నీటిని కత్తితో కెలుకుతూ, ''ఇదన్నమాట, నువ్వు నివసించే మాయాసరోవరం! కాంచనమాల కోరగా, నా మెడకు బిగించిన ఉచ్చును తొలగించావు; బాగానే వున్నది! ఇప్పుడు మనం మిత్రులమా లేక శత్రువులమా?'' అని అడిగాడు.

మాయాసరోవరేశ్వరుడు దిగులుగా ముఖంపెట్టి, కాంచనమాలకేసి చూశాడు. కాంచనమాల తడబడే గొంతుతో, ''జయశీలా, ఇక్కడ శత్రువులంటూ ఎవరూ లేరు. మకరకేతు చెప్పగా విన్నాను, నీ చేత గల కత్తిని, మహాకాలుడు ఆవేశించిన వాడెవడో ప్రసాదించాడని! దాని సాయంతో నువ్వు జలవృక రాక్షసులను ఊచకోత కోసి, వాళ్ళకు



బందీలుగా వున్న నా అన్న కాంచనవర్మనూ, మాయాసరోవరేశ్వర మామగారి కుమార్తె పద్మముఖినీ రక్షించాలి,'' అన్నది.

''నేను ఒంటరిగా అంత మంది జలవృక రాక్షసులతో యుద్ధం చేయటమా? ప్రయత్నిస్తాను. మీ నాన్న కనకాక్షరాజు గారికి వాగ్దానం చేసిన విధంగా నిన్నూ, నీ అన్ననూ జల రాక్షసుల నుంచి కాపాడవలసిన భారం మాత్రం నా మీద వున్నది,'' అన్నాడు జయశీలుడు.

జయశీలుడు ఇలా అనగానే మాయా సరోవరేశ్వరుడు ముందుకు వచ్చి, అతడి రెండు చేతులూ పట్టుకుని, ''జయశీలా, నేను హిరణ్యపుర రాజుగారి పిల్లల్ని అపహరించి, ఈ సరోవరానికి తెప్పించటంలో పెద్ద నేరం చేశాననుకోకు. మకరకేతుణ్ణి నేను పంపింది, రాజకుమారుడు కాంచనవర్మనొక్కణ్ణీ పట్టుకు రమ్మని మాత్రమే. అతడు బుద్ధిహీనుడవటం వల్ల, అతడితో పాటు సమయానికి కంటబడిన



దంతా నిజం. ఇప్పుడు మాయాసరోవర రహస్యం కూడా చెప్పేస్తున్నాను. ఈ సరోవరంలో పుట్టి పెరిగిన తామరకాడ నుంచి వచ్చిన రసాన్ని ఎవరైనా ఫాలభాగానికి రాసు కుంటే, ఇక వాళ్ళకు నీటిలో నివసించేశక్తి, బతికున్నన్నాళ్ళూ వుంటుంది,'' అన్నది.

''అలాగా! అయితే, పరీక్షించి చూస్తాను!'' అంటూ జయశీలుడు ఎగిరి సరోవరం నీటిలోకి దూకాడు.

ఒడ్డున వున్న మాయాసరోవరేశ్వరుడూ, కాంచనమాలా, మకరకేతూ ఒకటి రెండు నిమిషాల్లో జయశీలుడు నీటిపైకి తేలగలడని చూశారు. కాని, నాలుగైదు నిమిషాలు గడిచినా అతడు నీటిపైకి రాకపోయేసరికి ముందుగా కాంచనమాల ఆదుర్దాపడుతూ, ''జయశీలుడికేమైంది? జలవృక రాక్షసులు నీటి అడుగున పొంచి వుండి, అతణ్ణి పట్టుకోలేదు గద?'' అన్నది.

ఆ మరుక్షణం నీటిలో పెద్ద కల్లోలమైంది. జయశీలుడు, ఒక యువజలవృకుణ్ణి మెడ పట్టుకుని పైకి తేలి, వాణ్ణి ఒడ్డుకు ఈడ్చుకు వచ్చాడు. వాణ్ణి చూస్తూనే మకరకేతు, ''హా, మనకు దొరకవలసిన వాడే దొరికాడు! వీడు జలవృకుల నాయకుడి కొడుకు. బందీలుగా చిక్కిన మనవాళ్ళకు వీడి తండ్రి ఏమైనా హాని కలిగిస్తే, వీణ్ణి చిత్రవధ చేద్దాం,'' అన్నాడు.

''ఒరే, నువ్వు నీ తండ్రి - జలవృక నాధుడెక్కడ?'' అని అడిగాడు మాయాసరోవరేశ్వరుడు కత్తి పైకెత్తి.

''మా నాన్న అరణ్యంలో వున్న ఎవరో రాజునూ, కాపాలికుణ్ణీ హతమార్చటానికి

కాంచనమాలను కూడా పట్టుకుని ఇక్కడికి పంపాడు. ఆ సమయంలో రాజభటుల వల్ల గాయపడి మకరకేతు మీకు కనిపించి, మరి కొంత గొడవకు కారణం అయ్యాడు,'' అన్నాడు.

''ఇంతకూ యువరాజును అపహరించుకుని రావటంలో నీ ఉద్దేశం ఏమిటి?'' అని అడిగాడు జయశీలుడు.

నా ఒక్కగానొక్క కుమార్తె పద్మముఖిని అతడికిచ్చి వివాహం చేసి, హిరణ్యపురానికి పంపి, నేనీ సరోవరాన్ని వదిలి మరెక్కడికైనా పోదామనుకున్నాను. కాని పద్మముఖి, కాంచనవర్మను వివాహమాడనన్నది,'' అన్నాడు సరోవరేశ్వరుడు.

జయశీలుడు కాంచనమాలకేసి చూశాడు. కాంచనమాల నీటి అంచుకు పోయి, ఒక తామరకాడను తుంచి తెచ్చి, దాన్ని మెలిపెట్టగా వచ్చిన రసాన్ని, జయశీలుడి నుదుటి మీద బొట్టుగా పెట్టి, ''మామయ్య చెప్పిన

వెళ్ళాడు. తిరిగి వచ్చి మిమ్మల్నందర్నీ నరికి కాకులకూ, గద్దలకూ, మొసళ్ళకూ ఆహారంగా వేస్తాడు,'' అన్నాడు యువరాక్షసుడు.

''కాంచనమాలా పద్మముఖీ ఎక్కడున్నారు?'' అని అడిగాడు జయశీలుడు.

''వాళ్ళను దాచిన రహస్య ప్రదేశం మా నాన్న ఒక్కడికే తెలుసు,'' అన్నాడు యువ రాక్షసుడు.

అంతలో దూరంగా కలకలం లేచింది. ముందు ఖడ్గమృగం మీద జలవృకుల నాయకుడూ, వెనకగా ఒక గుంపు జలవృ కులూ రాతి గదలెత్తి, అక్కడికి వస్తూ, ''లొంగిపొండి!'' అంటూ అరిచారు.

ఆ వెంటనే జయశీలుడు, మకరకేతుతో, ''కేతూ, ఈ జలరాక్షసుడి కొడుకును, నీ జలగ్రహం తొండంతో పట్టి, పైకి ఎత్తేలా చేయి,'' అన్నాడు.

మకరకేతు, ''జలగ్రహా!'' అని హెచ్చ రించగానే, అది యువరాక్షసుణ్ణి తొండంతో పట్టి పైకి ఎత్తింది.

జయశీలుడు తమను సమీపిస్తున్న జలవృకులతో, ''ఒరే, దుర్మార్గులారా! మా మీద దాడి చేయాలని చూశారో, మీ నాయకుడి కొడుకు జలగ్రహం కాళ్ళకింద నలిగిపోతాడు,''అని గట్టిగా కేకపెట్టాడు.

అంతలో వాళ్ళ వెనక నుంచి నరవానరం మీద ఎక్కి వస్తున్న సిద్ధసాధకుడు, ''మహా రాజా, మీ సైనికులతో ఈ దుర్మార్గుల్ని చుట్టు ముట్టండి. అడుగో, జయశీలుడు!'' అంటూ అతడి దగ్గరకు వచ్చి నరవానరాన్ని దిగాడు.

జయశీలుడు, సిద్ధసాధకుడికి తన వెంట వున్నవాళ్ళను పరిచయం చేస్తున్నంతలో,



జలవృక రాక్షసుల నాయకుడు ఖడ్గమృగం మీద లేచి నిలబడి, రాతి గదను దూరంగా విసిరివేస్తూ, ''నేనూ, నా అనుచరులం లొంగిపోయాం. బందీగా చిక్కిన నా కొడుకును చంపకండి. నేను పట్టుకున్న మీ వాళ్ళనందర్నీ ఇప్పుడే ఇక్కడికి తెప్పిస్తాను,'' అన్నాడు.

అంతలో జయశీలుడి దగ్గరకు రాజు కనకాక్షుడు కూడా వచ్చాడు. కాంచనమాల పోయి తండ్రిని కావిలించుకుని, ''నాన్నా, మామ మాయాసరోవరేశ్వరుడికి ఎలాంటి హానీ కలిగించకు. జరిగినదానికి పశ్చాత్తాప పడుతున్నాడు,'' అన్నది.

''ఆయన కుమార్తె పద్మముఖి, మీ కోడలు కావటం కొద్దిలో తప్పిపోయింది,'' అంటూ జయశీలుడు నవ్వాడు.

''పద్మముఖి మనసు నాకు తెలుసు; ఆమె దేవశర్మను వివాహం ఆడాలనుకుంటున్నది,'' అన్నది కాంచనమాల.

దేవశర్మ, జలవృక రాక్షసుల నాయకుణ్ణి పెడరెక్కలు విరిచికట్టించి, నలుగురు సైనికులు వెంట రాగా జయశీలుడి దగ్గరకు వచ్చి, "జయశీలా, ఈ దుర్మార్గుడు బంధితులై వున్న పద్మముఖీ, కాంచనవర్మలను తెచ్చేందుకు తన అనుచరులను పంపాడు, ఇందులో మోసం ఉండదనుకుంటాను," అన్నాడు.

పావుగంట కాలం గడిచేలోపలే నలుగురు జలవృకరాక్షసులు కాంచనవర్మనూ, పద్మ ముఖినీ అక్కడికి తీసుకువచ్చారు. మాయా సరోవరేశ్వరుడూ, రాజు కనకాక్షుడూ పొందిన ఆనందం అంతా యింతా కాదు.

సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ కేకపెట్టి, "నేను విన్నదాన్నిబట్టి, పద్మముఖికి దేవశర్మతో వివాహం నిశ్చయ మైనట్టే శుభం! మరి రాజకుమారి కాంచన మాల సంగతేమిటి?" అన్నాడు.

రాజు కనకాక్షుడు, జయశీలుడికేసి తల తిప్పి, "అపహరింపబడ్డ నా పిల్లల్ని తెచ్చిన వీరుడికి అర్ధరాజ్యం ఇస్తానని ప్రకటించాను. జయశీలుడు ఆ కార్యం సాధించటమే గాక, మహావీరుడని కూడా అనిపించుకున్నాడు," అన్నాడు.

"కాంచనమాలకు అలాంటి మహావీరుడే తగిన భర్త!" అన్నాడు సిద్ధసాధకుడు.

కాంచనమాల సిగ్గుపడుతూ, తల వంచు కునిపోయి తండ్రిచాటున నిలబడింది. సిద్ధ సాధకుడు నవ్వి, "జయశీలుడికీ, కాంచన మాలకూ; పద్మముఖికీ, దేవశర్మకూ హిరణ్య పురంలో మహావైభవంగా వివాహాలు జరగ వలసి వున్నది! ఇక మీరంతా బయలుదే రండి," అన్నాడు.

"సాధకా, మరి నీ సంగతేమిటి?" అని అడిగాడు జయశీలుడు.

"నేనీ మాయాసరోవరం ఒడ్డున మహా కాలుణ్ణి మరికొంత కాలం ఉపాసిస్తాను. ఇక్కడ వున్న జలవృకరాక్షసులూ, అరణ్యంలోని నరభక్షకులూ నా బంట్లు!" అంటూ సిద్ధ సాధకుడు శూలం ఎత్తి పట్టుకున్నాడు.

జయశీలుడూ, రాజు కనకాక్షుడూ, మాయా సరోవరేశ్వరుడూ తమతమ పిల్లలతో, అనుచరులతో బయలుదేరారు. వాళ్ళు కొద్ది దూరం పోగానే జలవృక రాక్ష సులూ, చెట్ల చాటు నుంచి వచ్చిన నరభక్ష కులూ, సిద్ధసాధ కుడి చుట్టూ చేరి, అతడికి జేజేలు కొడుతూ, నాట్యాలు చేయసాగారు. -(అయిపోయింది)



బేతాళ కథలు

# వడ్డీకాసుల చెట్టు!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతిగొలిపే ఈ శ్మశానంలో, అర్ధరాత్రివేళ ప్రతి ఒక్క సారీ కార్యభంగం కలుగుతున్నా, మరింత పట్టుదలతో కార్యసాధనకై నువ్వు కనబరుస్తున్న దీక్ష మెచ్చదగిందే. కానీ, లోకంలో కొందరు వ్యక్తుల ప్రవర్తన అతి విచిత్రంగానూ, నిగూఢం గానూ వుంటుంది. అలాంటి వారు పరోపకారం చేస్తున్నామన్న భ్రమ కల్పించి, ఆత్మబంధువుల మధ్యా, రక్తసంబంధీకుల మధ్యా పరస్పర అనుమానాలూ, ద్వేష భావాలూ కల్పిస్తూంటారు. అలాంటి వారెవరో



నిన్ను ఏదో దుస్సాధ్యమైన కార్యాన్ని చేపట్టేలా ప్రోత్సహించి వుంటారన్న అనుమానం కలుగుతున్నది. ఈ విషయమై నీకు తగు హెచ్చరికగా వుండేందుకు, జడనాధుడనేవాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

భద్రపురంలో మణిదీపుడనే భాగ్యవంతుడున్నాడు. ఆయన భార్య వేదవతిది కూడా సంపన్న కుటుంబం. ఇద్దరూ ఎంతో మంచివారు; దానశీలురు. అడిగినవారికి లేదనకుండా ఇచ్చి సాయపడేవాడు మణిదీపుడు. ఇంటికొచ్చినవారిని కన్నతల్లిలా ఆదరించి పంపేది వేదవతి.

కూర్చుని తింటే కొండలైనా కరిగిపోతాయంటారు! ఆ దంపతుల ఒక్కగానొక్క కొడుకు గుణదీపుడు పెరిగి పెద్దవాడయ్యేసరికి, వారికి తాతలనాటి ఇల్లు మినహాయించి ఇంకేమీ మిగల్లేదు.

నిజానికి ఇంట్లో ఏం జరుగుతున్నదీ గుణదీపుడికి తెలియదు. వాడు అదే ఊళ్ళోని జడనాధుడనేవాడితో కలిసి దూరప్రాంతాలకు వెళ్ళి, వైద్యవిద్యనభ్యసించాడు. కొడుకు గుణదీపుడికేకాక జడనాధుడికి కూడా అవసరమైన డబ్బును మణిదీపుడు పంపుతూండేవాడు. విద్యాభ్యాసం పూర్తిచేసుకుని భద్రపురం వచ్చేసరికి, గుణదీపుడికి తన ఇంటి పరిస్థితులు తెలిసివచ్చాయి.

''పెద్దలిచ్చిన ఆస్తిని నీ ఇష్టం వచ్చినట్టు ఖర్చుచేసి, నాచేతికి చిప్పనిచ్చావు. ఇప్పుడేం చేయాలో నాకు పాలుపోవడం లేదు,'' అన్నాడు గుణదీపుడు కోపంగా తండ్రితో.

''నాయనా! సంపదలు మనవెంట రావు. మన మంచి మనలను సర్వదా కాపాడుతుంది. నీ తండ్రి చేసిన పనులన్నింటి వెనకా, నా ప్రోత్సాహం కూడా వుంది. అది తప్పని నీవనుకుంటే, ఆ తప్పు మా ఇద్దరిదీ. ఇప్పటికీ మనకు వచ్చిన లోటులేదు. నిలువ నీడ వుంది. నువ్వు వైద్యవృత్తి ప్రారంభించావంటే, నీకు బోలెడు ఆదాయం వస్తుంది,'' అంటూ కొడుకును సముదాయించింది వేదవతి.

గుణదీపుడు వైద్యవృత్తిని స్వీకరించాడు. అంతో ఇంతో ఆదాయం బాగా వస్తున్నా, అతడికి తృప్తిగా వుండేది కాదు. అందుకు కారణం జడనాధుడు. సంవత్సరం తిరక్కుండానే జడనాధుడికి తన మందులతో శవాలకు సైతం ప్రాణం పోయగలడన్న పేరు వచ్చింది. వైద్యం కోసం ఎక్కడెక్కడ నుంచో వచ్చే రోగులతో, అతడి ఇల్లు కిటకిటలాడిపోతూండేది. క్రమంగా అతడివద్ద సంపద పెరగసాగింది.

"నీ డబ్బుతోనే వైద్యవిద్య నేర్చుకుని, నీ కొడుక్కే పోటీగా తయారయ్యాడీ జడనాథుడు! నీ మూలంగా నా ఆస్తి పోయింది. నేర్చిన వైద్యవిద్యా అక్కరకు రావడం లేదు," అంటూ గుణదీపుడు తండ్రి మీద కోపంగా విసుక్కున్నాడు.

"నాయనా! ఇప్పుడు నీ ఆదాయం తక్కువేంకాదు. వైద్యవృత్తిలో సేవాధర్మమే ప్రధానం. నీవు నీ విద్యతో ప్రజలకు సాయపడు. అప్పుడు ప్రజలే నిన్ను గొప్పగా చూసుకుంటారు. నీకు జీవితంలో ఏ లోటూ వుండదు," అని మణిదీపుడు, కొడుక్కు హితవు చెప్పాడు కానీ, గుణదీపుడి దృష్టంతా సంపాదన మీదనే వుండేది. అదేమో పెరక్కుండా వుంది!

ఈ విషయం ఆ ఊళ్ళో బియ్యం వ్యాపారం చేసే మహాసేనుడికి తెలిసింది. ఆయనకు రత్నమాల అనే ఒకే ఒక్క కూతురు. తనకు మగబిడ్డలు లేనందున, ఆయన యోగ్యుడైన యువకుణ్ణి ఇల్లరికం తెచ్చుకోవాలని చూస్తున్నాడు. అందుకని ఆయన గుణదీపుణ్ణి కలుసుకుని, "బాబూ! నీ కుటుంబం గురించి నాకు బాగా తెలుసు. నీ పూర్వీకులు ఎన్ని దాన ధర్మాలు చేసినా, మీ కుటుంబం సిరి సంపదలతో వర్ధిల్లుతూండేది, అది వారి జాతకబలం. నీ తల్లిదండ్రులు నష్టజాతకులు! వారితో కలిసివుంటే నీకు ఏమీ అచ్చిరాదు. నా కూతుర్ని పెళ్ళిచేసుకో. నా ఇంటికి ఇల్లరికం వచ్చెయి. నీ తల్లిదండ్రులను దగ్గరకు చేర నివ్వకు," అంటూ తనకు అనుకూలంగానూ, అతడి తల్లిదండ్రులకు ప్రతికూలంగానూ మాటలు చెప్పాడు.



ఆ మాటలు గుణదీపుడి మీద బాగా పనిచేశాయి. అటుపైన రత్నమాల అందం కూడా అతణ్ణి ఆకర్షించింది. తానామెను పెళ్ళాడాలనుకుంటున్నట్టు తల్లిదండ్రులకు చెప్పాడు. అందుకు వాళ్ళు, "నాయనా! నీవు పెద్దవాడివయ్యావు. నీ మంచిచెడ్డలు నీకే బాగా తెలుసు. మేము నిన్ను దీవిస్తున్నాం!" అన్నారు.

దీనికి గుణదీపుడు ఆశ్చర్యపడి, "మీకిప్పుడు బొత్తిగా ఆదాయం లేదు. కొడుకుగా మిమ్మల్ని పోషించవలసిన బాధ్యత నా మీద వుంది. నేను మిమ్మల్ని అలక్ష్యం చేస్తే, లోకులు నన్ను దుమ్మెత్తిపొయ్యరా?" అని అడిగాడు.

మణిదీపుడు నవ్వి, "లోకాపవాదుకు భయపడి, నీవు మమ్మల్ని చేరదీయవద్దు. మా గురించి నీకు ఏ బెంగా వద్దు. నారు పోసినవాడే నీరూ పోస్తాడు," అన్నాడు.

గుణదీపుడు, రత్నమాలను పెళ్ళిచేసుకుని, అత్తవారింటికి వెళ్ళిపోయాడు. ఈ లోగా



జడనాధుడికి మణిదీపుడి అవస్థ తెలిసింది. అతడు వారిని చూడబోతే వాళ్ళు, "మేము సుఖంగా వున్నాం. మా అబ్బాయి ఎంత బ్రతిమాలినా, వాడి దగ్గరకు వెళ్ళడం లేదు. మా కట్టెలు, ఈ ఇంటనే వెళ్ళిపోవాలని మా కోరిక!" అంటూ, పరోక్షంగా తాము అతడితో రాలేమని సూచించారు.

జడనాధుడు కొద్దిక్షణాలు మౌనంగా వూరుకుని, "నేనిక్కడికి స్వార్థంతో వచ్చాను. మీ పెరట్లో ఒకచెట్టు వుంది. దాని పేరు ఎవరికీ తెలియదు. అయితే, ఆ చెట్టు కాయలతో అద్భుతమైన మందులు తయారు చేయవచ్చునని, నాకు తెలిసింది. అది ఏడాది పొడుగునా కాయలు కాస్తూనే వుంటుంది గదా. ఒక్కోకాయ పది బంగారు కాసుల విలువచేస్తుంది. ఐతే, అంత ధరనేనివ్వలేను. మీరు రోజూ నాకు ఒక కాయ ఇస్తే, నేను మీకు ఒక్క బంగారు కాసు ఇవ్వగలను. మీరు జీవించి ఉన్నంతకాలం, ఆ చెట్టు కాయలు మరెవరికీ అమ్మబోమనీ, ప్రతిరోజూ నాకొకకాయ తప్పక అమ్మగలమనీ పత్రం రాసి ఇస్తే, నాకెంతో మేలుచేసినవారౌతారు," అని చెప్పాడు.

మణిదీపుడు ఆలోచనలో పడి, "నీవు చెప్పేవరకూ నాకు మా చెట్టుకాయల విలువ తెలియదు. వాటిని నీవడిగిన ధరకు తప్పక ఇవ్వగలను. కానీ నేను నీకు పత్రమెందుకు రాయాలో తెలియడంలేదు," అన్నాడు.

"అయ్యా! ఈ కాయల విలువ బయటి వాళ్ళకు తెలిస్తే ప్రమాదం. వాటిని అమ్మమని చాలామంది అడుగుతారు. ఆ కాయలను ఒక రకంగా వాడితే ప్రాణాలు పోసే మందు అవుతుంది; మరొకరకంగా వాడితే ప్రాణాలు తీసే విషం కూడా కాగలదు. ఇవి నావంటివాడి చేతిలో వుంటేనే దురుపయోగం కాకుండా వుంటాయి. మీరు పత్రం రాయడం వల్ల, మీపై వేరెవరూ ఒత్తిడిచేసే అవకాశం లేదు," అని జడనాధుడు వివరించి చెప్పాడు.

మణిదీపుడు, జడనాధుడు కోరిన విధంగా పత్రం రాసి ఇచ్చాడు. ఆ రోజు నుంచీ మణిదీపుడి దశ తిరిగింది. ఆయన తను సుఖంగా తింటూ, అవసరంలో వున్నవారిని ఆదుకుంటూ, ఎప్పటిలా పరోపకారం కొనసాగిస్తున్నాడు.

తండ్రి పరిస్థితి మళ్ళీ మెరుగుపడినట్టు గ్రహించిన గుణదీపుడు, కారణం అర్థంకాక సతమతమయ్యాడు. అతడి భార్య రత్నమాల, అతడితో, "నీ తండ్రి నిన్ను మోసం చేశాడు. ఆయన వద్ద పెద్దలిచ్చిన ఆస్తి ఇంకా చాలా వుండి వుంటుంది. ఆ ఆస్తిని ఇష్టం వచ్చినట్టు ఖర్చుచేస్తున్నాడు. నువ్వు వెళ్ళి అందులో వాటా అడుగు," అంటూ రెచ్చగొట్టింది.

గుణదీపుడు, తండ్రిని కలుసుకుని, ఆస్తివిషయమై నిలదీశాడు. మణిదీపుడికి పెరటిచెట్టు కాయల విషయం చెప్పక తప్ప లేదు. ఆ విషయం వినగానే గుణదీపుడు పెరట్లోకి పరిగెత్తి, అవి వేల సంఖ్యలో వుండడంతో గుండెలు బాదుకుని, "ఇంత విలువైన చెట్టు విషయాన్ని నాకు చెప్ప కుండా దాచడమేకాక, నాతో సంప్రదించ కుండా కాయల గురించి పత్రం కూడా రాశావు. ఇది చాలా అన్యాయం. నా వాటా కోసం ఇప్పుడే గ్రామాధికారికి ఫిర్యాదు చేస్తాను," అంటూ గొడవ చేశాడు.

ఈ సంగతి గ్రామాధికారిదాకా వెళ్ళడం ఇష్టంలేక, మణిదీపుడు, జడనాధుడికి కబురుపెట్టాడు. అతడు వచ్చి సంగతి తెలుసుకుని, "గుణదీపుడి మాటల్లో న్యాయముంది. నేనొకఉపాయం చెబుతాను. ఈ చెట్టు కాయల్లో నాలుగువేల కాయలను తీసుకుని వెళతాను. అందుకు ప్రతిఫలంగా మీకు నేను ప్రతిరోజు ఒకబంగారు కాసు చొప్పున పదకొండు సంవత్సరాలు ఇవ్వాల్సి వుంటుంది. అయితే, కాయలు ముందుగా ఇస్తున్నారు కాబట్టి, మీ డబ్బుకు బాగా వడ్డీకూడా వస్తుంది. అందువల్ల నేను, మీరు జీవించి వున్నంతకాలం రోజుకొక్క బంగారు కాసు ఇచ్చుకుంటాను. ఈ రోజు నుంచీ, ఈ చెట్టుపైనా, దాని కాయలపైనా సర్వాధికారాలు గుణదీపుడికే విడిచిపెడదాం," అన్నాడు మణిదీపుడితో.

ఇది గుణదీపుడికీ నచ్చింది. ఆ తర్వాత గుణదీపుడు ఆ చెట్టు కాయలను అమ్మడానికి ప్రయత్నిస్తే, ఆ కాయల్లో వైద్యానికి పనికొచ్చే ఎలాంటి గుణం లేదన్నారు వైద్యులు. చివరకు



గుణదీపుడు, జడనాధుడి వద్దకే వెళ్ళి, "నీకు తోచిన వెలకట్టి ఆ కాయలు నువ్వే తీసుకో," అన్నాడు.

జడనాధుడు నవ్వి, "ఆ పిచ్చికాయల్ని నేనేం చేసుకోను?" అన్నాడు.

"అవి పిచ్చికాయలా? వాటికేగా నువ్వు కాయకు బంగారుకాసు చొప్పునవెల గట్టావు!" అన్నాడు గుణదీపుడు ఆశ్చర్యంగా.

"నీ తండ్రి నుంచి తీసుకున్నప్పుడే, ఆ కాయలు నాకు విలువైనవి. మీ పెరటిచెట్టు వడ్డీకాసుల చెట్టు! నీతండ్రి ఇతరులకు చేసిన ఉపకారాల పెట్టుబడికి వడ్డీగా కాసులు ఇచ్చే కాయలనది కాస్తుంది!" అన్నాడు జడనాధుడు.

ఆ జవాబుకు గుణదీపుడి ముఖం వెలవెలపోయింది. అతడు తలవంచుకుని కొంత సేపు మౌనంగా వూరుకుని, "జడనాధా! నువ్వు మా కుటుంబ విషయాల్లో ఇంత నర్మగర్భంగా ప్రవర్తించవలసింది కాదు. ఏమైనా నాకళ్ళు

తెరిపించినందుకు కృతజ్ఞతలు!'' అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా! వైద్య విద్య పూర్తిచేసి తిరిగివచ్చినప్పటి నుంచీ, మణిదీపుడికి తన కుటుంబం పట్ల జడనాథుడి ప్రవర్తన విచిత్రంగానూ, నిగూఢంగానూ వున్నట్టు తెలుస్తూనేవున్నది కదా? తనసహాధ్యాయి అయిన గుణదీపుడు, తల్లిదండ్రుల పట్ల కనబరుస్తున్న నిరాదరణ, జడనాథుడికితెలియంది కాదు. ఐనా, అతడు గుణదీపుడిని సరిదిద్దేందుకు ప్రయత్నించలేదు. వైద్య వృత్తిలో తనకు మితిమించిన సంపాదన వున్నది గనక, మణిదీపుడి పెరటిచెట్టు కాయలను అడ్డం పెట్టుకుని వినోదించినట్టు కనబడుతున్నది. అది తను వైద్యవిద్యనభ్యసించేందుకు సాయపడిన ధర్మాత్ముడి పట్ల అమర్యాదా, కృతఘ్నతా అనిపించుకుంటుంది గదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''జడనాథుడి ప్రవర్తనలో విచిత్రం, నిగూఢత కాక; ఆర్థికంగా, మానసికంగా స్థాయీభేదాల్లో వుండే మనుషుల ప్రవర్తనకు అనుగుణంగా ఎలా మసులుకోవాలో ఎరిగిన లోకజ్ఞత కనబడుతున్నది. ఎంత నిరాదరణకు గురైనా నిర్మల మనస్కులైన తల్లిదండ్రులు, తమ కన్నబిడ్డలను ఇతరుల వద్ద కించపరచరు. ఆ కారణం వల్లనే మణిదీపుడు, జడనాథుడితో - మా అబ్బాయి ఎంత బతిమాలినా, వాడి దగ్గరకు వెళ్ళడం లేదు, అన్నాడు. అలాంటి పరిస్థితుల్లో చేసేది లేక, తనకు మేలు చేసినవారి పట్ల కృతజ్ఞత కనబరచడానికి, జడనాథుడు పెరటిచెట్టు కాయలకు లేనిపోని విలువ కట్టి, మణిదీపుడికి సాయపడ్డాడు. ఆ తర్వాత, గుణదీపుడు చెట్టుకాయలకు తోచిన వెలకట్టి తీసుకోమన్నప్పుడు జడనాథుడు - నీతండ్రి నుంచి తీసుకున్నప్పుడే ఆ కాయలకు విలువ అనేశాడు. ఆ జవాబుతో, జరిగిన వాస్తవం, తన తల్లిదండ్రులు చేసిన పరోపకారం విలువ, ఏమిటో గ్రహించిన గుణదీపుడు, నా కళ్ళు తెరిపించావంటూ కృతజ్ఞత చెప్పుకుని వెళ్ళిపోయాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: 'వసుంధర' రచన]






# ఉబ్బెత్తు కుడ్యచిత్రాలు



కేరళ రాష్ట్రం తిరుచ్చూరు సమీపంలోని కాలడి శ్రీ శంకర విశ్వవిద్యాలయ ప్రాంగణంలోని 1,200 అడుగుల పొడవైన గోడ అందమైన ఉబ్బెత్తు చిత్రాలతో అలంకరించబడి ఉన్నది. ఐదు అడుగుల ఎత్తు గల ఒక కుడ్య చిత్రంలో శిష్యుణ్ణి వరుసగా నాలుగు యుగాలు అంటే కృత, త్రేతా, ద్వాపర, కలి యుగాలకేసి నడిపిస్తూ జ్ఞానబోధ చేసే గురువు సాక్షాత్కరిస్తాడు. రామాయణం, మహాభారతం, శాకుంతలం, మేఘసందేశం, రఘువంశం మొదలైన గ్రంథాలలోని దృశ్యాలు చిత్రీకరించబడి ఉన్నాయి. భరతనాట్యంలోని 108 కరణాలు, ఆదిశంకరుల జీవితగాథ మొదలైనవి చూపరులను అలరిస్తాయి. మూడేళ్ళ శ్రమ ఫలితంగా ఇది 1998వ సంవత్సరంలో పూర్తయింది. ఈ అపూర్వ సృష్టి 'గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్'లో చోటు చేసుకున్నది!

# అందరూ శాకాహారులే!

శారీరక మానసిక ఆరోగ్యం దృష్ట్యా, ఇటీవల చాలామంది శాకాహారం పట్ల ఆకర్షితులవుతున్నారు. ఒరిస్సాలోని ఒక గ్రామంలో యాభై పై చిలుకు కుటుంబాలు ఉన్నాయి. వాళ్ళెవ్వరూ, మాంసం, చేపలు, వండడంలేదు. కేవలం శాకాహారం మాత్రమే తీసుకుంటున్నారు. తూర్పు ఒరిస్సాలో ఢేన్ కనాల్‌కు 50 కిలోమీటర్ల దూరంలో వున్న బెంటసాలియా గ్రామ ప్రజలే ఈ నిర్ణయానికి వచ్చారు. ఈ గ్రామస్థులందరూ అచ్యుతానంద గురువు బోధలను అనుసరించే వైష్ణవులు. వాళ్ళు తరతరాలుగా వైష్ణవాచారాలు పాటిస్తున్నారు. దీర్ఘాయువుతో ప్రశాంత జీవితాలు సాగిస్తున్నారు. ఇంత వరకు ఈ గ్రామ ప్రజలు ఎలాంటి ప్రకృతి వైపరీత్యాలకుగానీ, భయానక వ్యాధులకు గానీ గురికాలేదు. అంటే బెంటసాలియాలో మనుషులూ, జంతువులూ శాంతియుత సహజీవనం కొనసాగిస్తున్నారన్న మాట!



మన పూర్వ గాథలు : 18

# ఏటికి ఎదురీత!



హిమాలయ పర్వత పాదతలంలో ఉన్న హరిద్వారం అతి పురాతనకాలం నుంచి పవిత్రక్షేత్రంగా ప్రసిద్ధిగాంచింది. అక్కడి ఆశ్రమాలు రకరకాల యోగసాధనలు చేసే యోగులకూ, గురువులకూ నిలయాలుగా ఉండేవి.

హరిద్వారానికి సమీప పట్టణంలో నివసించే ఒక ధనిక వర్తకుడు తరచూ అక్కడికి వచ్చి, ఒక ఆశ్రమంలో ఉంటున్న ఒక వృద్ధజ్ఞానిని గురువుగా భావించి దర్శించుకుని వెళ్ళేవాడు. తను చేసే వర్తకంలో నష్టం వచ్చినా, వ్యాపార భాగస్వాముల మధ్య మనస్పర్థలు తలెత్తినా, భార్యాపిల్లలతో భేదాభిప్రాయాలు పొడసూపినా, వర్తకుడు విరక్తితో హరిద్వారానికి చేరుకునేవాడు. గురువు అతన్ని ఆప్యాయంగా ఆదరించేవాడు. వర్తకుడికి గురువు సమక్షంలో మానసిక ప్రశాంతత లభించేది.

గురువు తన శిష్యులకు హిత వచనాలు పలికే సమయంలో, వర్తకుడు ఆయన పాదాల వద్ద కూర్చునేవాడు. గురువు చేసే హితబోధలను ఆసక్తిగా ఆలకించేవాడు. అంత మాత్రాన గురువు మాటలలోని అర్థాలను క్షుణ్ణంగా అర్థం చేసుకునే వాడా అంటే, అదేం కాదు. అంతే కాదు, గురువు మాటలను సరిగ్గా అర్థం చేసుకోలేకపోయినప్పటికీ, అంతా అర్థమైనట్టు గురువు అభిప్రాయాలతో ఏకీభవించేవాడు కాదు. తెలిసీ తెలియని మిడిమిడి జ్ఞానంతో గురువుతో వాదానికి దిగేవాడు. ఉదాహరణకు తరచూ జరిగే ఒక సంఘటననే చెప్పవచ్చు: తన భాగస్వాములతో వచ్చిన మనస్పర్థను గురువుకు ఏకరువు పెట్టి, ఆ కారణంగా మన శ్శాంతి కరువయిందని చెప్పేవాడు. అందుకు

గురువు, "నాయనా! మనశ్శాంతి కావాలంటే మొదట నిన్ను నువ్వు దివ్యశక్తికి సమర్పించుకోవాలి. ప్రతి ఒక్క పనినీ దివ్యశక్తికి సమర్పణా భావంతో చేయడం అలవాటు చేసుకోవాలి!" అనేవాడు.

అయితే, ఆ మాటలు వర్తకుడి బుర్రకు ఎక్కేవి కావు. వ్యాపారంలో భాగస్వాములు తనను మోసగించడంలోనూ, ఒక చోటి నుంచి మరొక చోటికి సరుకులను చేరవేస్తున్నప్పుడు దొంగతనం జరగడంలోనూ దివ్యశక్తి ప్రమేయం ఏమిటో అతనికి ఓపట్టాన అంతుబట్టేది కాదు.

"స్వామీ, ఎవరైనా నన్ను మోసం చేసినప్పుడు, న్యాయాధికారి వద్దకు వెళ్ళి ఫిర్యాదు చేయాలి కదా? ఇలాంటి ప్రాపంచిక సమస్యలలో దివ్యశక్తి నాకు ఏ విధంగా సాయపడగలదు?" అని అడిగేవాడు.

గురువు మొదటచెప్పిన సమాధానాన్నే మళ్ళీ మరింత విపులంగా విశదీకరించేవాడు. "అలాంటి సమయాలలో న్యాయాధికారుల వద్దకూ, రక్షకభటుల వద్దకూ వెళ్ళాలి. మోసగాళ్ళను శిక్షించాలి. దొంగిలించబడిన సరుకులను తిరిగి రాబట్టుకోవాలి. అయితే అవి మాత్రమే మనిషికి మనశ్శాంతిని ఇవ్వజాలవు. ఒక సమస్య పరిష్కారమైతే, మరొక సమస్య పుట్టుకు రావచ్చు. జీవితం సమస్యల పుట్ట. అందువల్ల నిజాయితీగా వ్యాపారాన్ని కొనసాగించటానికి అవసరమైన వాటినన్నింటినీ తప్పక చేసి తీరాలి. అయితే, మనిషి నిజంగానే మనశ్శాంతిని కోరుకుంటున్నట్టయితే, అతడు తన్ను తాను దివ్యశక్తికి సమర్పించుకోవాలి. దేవుడి ముందు శరణాగతి పొందాలి. అలా చేసినప్పుడు, ఒక వేళ అనివార్య కారణాల వల్ల తన లక్ష్యాన్ని అందుకోలేక పోయినప్పటికీ, పరిస్థితులనను సరించి తృప్తిగా జీవితం గడపగలడు. ఎందుకంటే, తనకు ఏది మంచి? ఏది కాదు? అన్న సంగతి తనకన్నా బాగా ఎరిగిన సర్వశక్తి సమన్విత దైవశక్తికే తన్ను సమర్పించుకున్నానన్న అంకిత భావం అతనిలో వుంటుంది గనక, అక్కడ అశాంతికి స్థానం ఉండదు."

ఒకనాటి సాయంకాలం ఈ విషయం గురించి వర్తకుడు గురువుతో చాలాసేపు మాట్లాడాడు. ఒక నిర్ణయానికి రాలేక వాగ్వాదానికి దిగాడు. అయినా గురువు ఓర్పును కోల్పోలేదు. ఒక విషయాన్ని ఎదుటివారు అర్థం చేసుకుని విశ్వసించేలా చెప్పలేక పోయినప్పుడు మౌనంగా ఊరుకోవడం ఆయన అలవాటు. అర్ధరాత్రి సమీపిస్తున్న సమయంలో



గురువు అదే పని చేశాడు. అంత వరకు కూర్చునేలా చేసినందుకు వర్తకుడు గురువుకు క్షమాపణలు చెప్పుకుని వెళ్ళి పడుకున్నాడు.

ఇంకా తెల్లవార లేదు. సూర్యోదయానికి ఒక గంట సేపు ఉన్న సమయంలో గురువు వచ్చి వర్తకుణ్ణి హఠాత్తుగా తట్టి నిద్ర లేపాడు. వర్తకుడు ఆశ్చర్యపోయాడు. అయినా మాట్లాడకుండా గురువు వెంట నడిచాడు. గడచిన రెండు మూడు రోజులుగా చుట్టుపక్కల కుంభవృష్టి కురిసింది. ఇప్పటికీ అప్పుడప్పుడు చిన్నగా చినుకులు పడుతున్నాయి. వాతావరణం ప్రశాంతంగా ఉంది. గురువు వర్తకుణ్ణి ఇరు తీరాలను ఆనుకుని వరదలా ప్రవహిస్తున్న గంగా తీరానికి తీసుకువెళ్ళాడు. ఎత్తయిన అలలతో నది భయం పుట్టించేలా ప్రవహిస్తోంది.

గురువు ఏం చేయనున్నాడా అన్న ఉత్కంఠతతో వర్తకుడు ఆయనకేసి చూశాడు. గురువు, ''అలా చూడు!'' అంటూ చూపుడువేలితో ప్రవాహంలో కొట్టుకుపోతున్న ఏనుగును చూపాడు.

ఆ తరవాత, ''ఇక్కడ చూడు!'' అంటూ తీరానికి సమీపంలో ఒక చిన్న చేప ప్రవాహానికి ఎదురుగా అతి సునాయాసంగా ఈదుకుంటూ వెళ్ళడం చూపించాడు.

వర్తకుడు రెండింటినీ చూసి, ''ఏమిటి?'' అన్నట్టు గురువుకేసి తలెత్తి చూశాడు.

''ఈ దృశ్యాలను చూసి, నువ్వు అర్థం చేసుకున్నదేమిటి?'' అని అడిగాడు గురువు.

వర్తకుడు ఏమీ సమాధానం చెప్పలేదు.

''బ్రహ్మాండమైన ఆకారం గల బలమైన జంతువు ఏనుగు సైతం ప్రతికూల పరిస్థితుల తరంగాలను ఎదురీదలేక తన ఇష్టానికి విరుద్ధంగా ప్రవాహంలో కొట్టుకుపోతున్నది. అయితే, ఆకారంలో అతి చిన్నదైన ఈ అల్ప ప్రాణి చేప, నదికి చెందినదే గనక, దాని ఇష్టానుసారం ప్రవాహానికి ఎదురీద గలుగుతోంది. నిన్ను నువ్వు అనంతమైన దివ్యశక్తికి అర్పించుకున్నప్పుడు నువ్వూ ఆ దివ్యశక్తిలో అంతర్భాగమైపోతావు. దివ్యశక్తి దుఃఖాతీతం, నిర్వికల్పం గనక, నీలోనూ ఎలాంటి బాధలూ, ఆందోళనలూ కలగవు. రాత్రి నేను చెప్పిన సంగతి ఇప్పుడు అర్థమయింది కదా?'' అన్నాడు గురువు వర్తకుడి వీపును ఆప్యాయంగా చరుస్తూ.

''అర్థమయింది స్వామీ! మిడిమిడి జ్ఞానంతో వాదించిన నా మూర్ఖత్వాన్ని క్షమించండి!'' అంటూ వర్తకుడు గురువుకు భక్తితో నమస్కరించాడు.

– బిందుసార్



## తీరిన చివరి కోరిక!



పదేళ్ళ హుయాంగ్ గే తీరని క్యాన్సర్ వ్యాధితో బాధపడుతున్నాడు. ఒకనాడు అతను తన తండ్రి హుయాంగ్ క్సియాయో యాంగ్‌తో - చీనా రాజధాని బీజింగ్‌లో ఉన్న సుప్రసిద్ధమైన టియాన్ మన్ స్క్వేర్‌ను చూడాలని ఆశగా ఉందని చెప్పాడు. అది వాళ్ళున్న చోటికి దాదాపు రెండు వేల కి.మీ. దూరం. తండ్రికి బిడ్డ పట్ల అపారమైన ప్రేమ. అందువల్ల తన కొడుకు కోరికను ఎలాగైనా తీర్చాలని అనుకున్నాడు. ఆయన వయస్సు 44 సంవత్సరాలు. ఆయన వద్ద ఒక సైకిలు మాత్రమే ఉన్నది. దాని మీద ఇద్దరూ కూర్చునేలా రెండు సీట్లు -ఎండకూ, వానకూ తట్టుకునేలా నీడ ఏర్పాటు చేసుకున్నాడు. కొడుకును వెనక సీట్లో కూర్చోబెట్టుకుని, బీజింగ్‌కు సైకిల్ తొక్కుతూ బయలుదేరాడు. 62 రోజుల తరవాత గమ్యస్థానం చేరుకున్నాడు. తాను తుదిశ్వాస విడిచేలోగా - ఎన్నో ముఖ్యమైన చారిత్రక సంఘటనలు జరిగిన ఆ స్థలాన్ని చూసిన కుర్రవాడు ఎంతగానో ఆనందించాడు.

## తరలివెళ్ళిన చివరి యూదు కుటుంబం !

ఇండియాలో వున్న చివరి యూదు కుటుంబం ఇండియాకు వీడ్కోలు పలికి తమ పితృదేశమైన ఇజ్రాయెల్‌కు తరలి వెళ్ళింది. జోసెఫ్ సైమన్, ఆయన భార్య యూహుదిత్, పిల్లలు శ్యామ్, సుసాన్-కేరళలోని 600 సంవత్సరాల నాటి పరాపూర్ యూదుల ప్రార్థనా మందిరం (సినగాగ్) ముందు కొన్ని నిమిషాలు మౌనంగా నిలబడి, ఆ తరవాత వెనక్కు తిరిగి తమ కోసం కాచుకుని వున్న కారెక్కారు. వాళ్ళకు వీడ్కోలు పలకడానికి యూదు వీధిలో కాపురముంటూన్న వారందరూ గుమిగూడారు. యాభై యేళ్ళకు పూర్వం ఆ వీధిలో అందరూ యూదులే ఉండేవారు. ఒక్కర్తి తరవాత ఒకరుగా అందరూ స్వదేశానికి వెళ్ళిపోవటంతో, సైమన్ కుటుంబానికి ఒంటరితనం పట్టుకున్నది. వాళ్ళు సంప్రదాయంగా జరుపుకునే ప్రార్థనలలో, ఉత్సవాలలో పాల్గొనడానికి ఎవరూ లేరు. పిల్లలు పెరిగాక ఇండియాలో సంబంధాలు దొరికే అవకాశం లేదని గ్రహించిన తల్లిదండ్రులు, స్వదేశానికి వెళ్ళడానికి నిశ్చయించారు. ప్రార్థనా మందిరం ఇప్పుడు పరిరక్షిత స్మారక భవంతిగా ప్రకటించబడింది.



మన దేశంలో ఇటీవల ఏర్పడిన రాష్ట్రాలలో ముఖ్యమైనది ఉత్తరాంచల్. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం నుంచి 13 జిల్లాలను విడదీసి డెహ్రాడూన్ రాజధానిగా 2000వ సంవత్సరం సెప్టెంబరు నెలలో ఈ నూతన రాష్ట్రాన్ని ఏర్పాటు చేశారు. పర్వత ప్రదేశమైన ఈ రాష్ట్రం ప్రకృతి సౌందర్యానికీ, ప్రశాంతతకూ నిలయమని చెప్పవచ్చు.

కేదారనాథ్, బదరీనాథ్, గంగోత్రి, యమునోత్రి మొదలైన పవిత్ర యాత్రా స్థలాలు కలిగిన ప్రాంతం గనక దీనిని 'దేవభూమి' అని కూడా పిలుస్తారు.

తూర్పు దిశగా నేపాల్, ఉత్తరం వైపు దిగువ హిమాలయాలు చైనా వైపు సరిహద్దులుగా ఉన్నాయి. పడమర, వాయవ్య దిశలలో హర్యానా, హిమాచల్ ప్రదేశ్‌లు సరిహద్దులుగా ఉన్నాయి. చాలా వరకు పర్వత మయంగా ఉన్న ఈ రాష్ట్రంలో 10 శాతం మాత్రమే మైదానాలు ఉన్నాయి. గంగ, యమున, భాగీరథి, అలకానంద మొదలైన నదులు ఇక్కడే ఆవిర్భవిస్తున్నాయి.

84,79,562 జనాభా కలిగిన ఉత్తరాంచల్ రాష్ట్రం 55,845 చదరపు కిలోమీటర్లు విస్తరించి వున్నది. ఇక్కడి ప్రజలు ముఖ్యంగా హిందీ, గర్వాలీ, కుమౌలీ భాషలను మాట్లాడుతారు.

# పిల్లి చేసిన మేలు!

పౌరీ కొండల దిగువన వున్న ఒక చిన్న ఇంట్లో వృద్ధదంపతులు నివసిస్తూ వుండేవారు. వాళ్ళ ఏకైక సంతానం నేగీ. నేగీ అంత తెలివైన వాడు కాడు. మరీ అమాయకుడు. అమాయకత్వం కారణంగా అందరితోనూ మంచిగా నడుచుకునేవాడు. చిన్నచిన్న కళ్ళతో చాలా అందంగానూ, ఆకర్షణీయంగానూ కనిపించేవాడు.

వాళ్ళ ఇంటినానుకుని ఒక చిన్న సెలయేరు పారుతూ వుండేది. నేగీ తరచూ ఆ సెలయేటి ఒడ్డున ఒక బండపై కూర్చుని వేణువును ఊదుతూ ఉండేవాడు. చుట్టు



పక్కల మేకలు మేస్తూండేవి. సెలయేటి నీళ్ళలోని చేపలు సూర్యరశ్మి పడి మిల మిలా మెరిసేవి. నేగీ జంతువుల, పక్షుల జోలికి వెళ్ళేవాడు కాడు గనక, అవి కించిత్తు కూడా భయపడకుండా వాడి సమీపంలోకి వచ్చి ఆడుకునేవి.

అయితే, కొడుకు వాలకం చూసి వాడి తల్లిదండ్రులు దిగులుపడసాగారు. తాము రేపో మాపో చనిపోతే అమాయకుడైన వాడెలా బతగ్గలడు? అన్న విచారం ఆ వృద్ధ దంపతులకు పట్టుకున్నది.

ఒకనాడు వాడి తల్లి, గూట్లో కోడి పెట్టిన గుడ్లను తీస్తూ, "రేపు మన నేగీ గతేం కాను? మనం పోయాక లోకంపోకడ తెలియని ఆ అమాయకుడి మంచి చెడ్డలు చూసుకునే వారెవ్వరు?'' అని అడిగింది భర్తను బాధగా.

ఆ మాటలకు మేకల వద్ద పాలు పితుకుతున్న నేగీ తండ్రి, ఆమెకేసి తలెత్తి చూశాడు. కాని ఆమె ప్రశ్నకు సమాధానం చెప్పకుండా మౌనంగా ఊరుకున్నాడు. తీవ్రంగా ఆలోచిస్తున్న ఆయన చూపులు దూరంగా కనిపించే మంచు కప్పిన కొండల మీద పడ్డాయి. ఎక్కడో కూర్చుని నేగీ వాయి స్తూన్న వేణునాదం, మందవాయువులతో కలిసి వచ్చి ఆయన చెవులను సోకింది.

ఆనాటి రాత్రి నేగీ తండ్రికి నిద్ర పట్ట లేదు. పడక మీద పొర్లి పొర్లి పడుకున్నాడు. వేకువజామున లేచి, కొడుకును తట్టి లేపుతూ, "నేగీ, లేరా, నీకొక ముఖ్య విషయం చెప్పాలి,'' అన్నాడు.

నేగీ కళ్ళు నులుముకుంటూ లేచి కూర్చున్నాడు. అప్పుడే తెల్లవారుతున్నది.



కొండలు మెల్లమెల్లగా కనిపించసాగాయి. కోడి కూతలూ, పక్షుల కిలకిలారావాలూ వినిపిస్తున్నాయి.

నేగీ తండ్రి వెంట మేకల కొట్టం దగ్గరికి వెళ్ళాడు.

తండ్రి కొట్టం లోపలికి వెళ్ళి బలిసిన ఒక ఉన్నిమేకనూ, భూటియా అనే వేట కుక్కనూ పట్టుకుని వచ్చాడు. ఆ మేక నేగీ తల్లికి ఇష్టమైన బుల్‌బుల్. దాని మెడకు చిన్న గంట వేలాడుతున్నది. నేగీ తల్లి దానికి ఇష్టమైన మేతను కావలసినంత పెట్టడం వల్ల, అది కండపట్టి బాగా బలిసి ఉంది.

"మీ అమ్మ ప్రాణప్రదంగా మేపుతున్న బుల్‌బుల్‌ను నీకప్పగిస్తున్నాను. దీనిని పట్టుకుపోయి డబ్బు సంపాదించుకుని రావాలి,'' అని చెప్పి తండ్రి కొంతసేపు ఆగి, "అయితే, ఒక విషయం గుర్తుంచుకో. ఈ మేకను అమ్మడంగానీ, దీన్ని చంపి మాంసం విక్రయించడంగానీ చేయకూడదు. నువ్వు



తిరిగి వచ్చేటప్పుడు డబ్బుతో రావాలి సుమా!'' అన్నాడు.

నేగీ సరేనని తల ఊపి, తల్లిదండ్రుల పాదాలకు నమస్కరించి, మేకను పట్టుకుని బయలుదేరాడు.

చిన్నకొండనెక్కి కొంత సేపటికి లోయను దాటాడు. దారిలో ఆకులలములు మేస్తూ బుల్‌బుల్ వాడి వెంట వెళుతూంటే, భూటియా చుట్టుపక్కల కలయజూస్తూ మేకకు రక్షణగా ముందు నడవసాగింది.

ఆకలికి దారిలో కనిపించిన పళ్ళను కోసి తింటూ, సెలయేళ్ళలో దప్పిక తీర్చు కుంటూ, నేగీ ఆ రోజంతా నడిచాడు. సాయంకాలానికి బాగా అలిసిపోవటంతో, ఒక దేవదారు చెట్టు బోదెకు ఆనుకుని కూర్చున్నాడు. బుల్‌బుల్ అతని పక్కనే కూర్చుని నెమరు వేయసాగింది. దానిని చూస్తూ నేగీ మనసులో అనుకుంటు న్నట్టు, 'నేను నిన్ను అమ్మకూడదు. మాంసం కోసం చంపకూడదు. అయితే, డబ్బు మాత్రం సంపాయించాలి! అదెలా సాధ్యం? ఇలా చెప్పడంలో నాన్న ఉద్దేశ మేమిటి?'' అన్నాడు.

బుల్‌బుల్ తలవంచుకుని నెమరు వేయడంలో నిమగ్నమై ఉండడంతో, దాని తల మీద ప్రేమతో తట్టి, పచ్చికమీద నడుం వాల్చాడు. వాడి కాళ్ళ దగ్గర భూటియా కూర్చున్నది. ఆ రాత్రికి చెట్టు కింద అలాగే నిద్రపోయాడు.

మరునాడు పక్షుల కిలకిలారావాలతో నిద్రలేచాడు. కళ్ళు తెరవగానే, చెట్టుకొమ్మ మీద బెదురు బెదురుగా చూస్తున్న ఒక పిల్లి కనిపించింది. దారి తప్పి అటు వచ్చిన ఆ పిల్లి, భూటియాను చూసి హడలిపోయి, దాని నుంచి తప్పించుకోవటానికి చెట్టు పైకి వెళ్ళిందన్న మాట!

చెట్టుకొమ్మ మీద పిల్లి భయంతో గడగడ లాడుతూ వుంటే, చెట్టుకింద భూటియా అమితోత్సాహంతో తోకను ఆడిస్తూ, అటూ ఇటూ తిరుగుతున్నది.

ఆ సమయంలో చెట్ల చాటునుంచి ఏదో మాట్లాడుకుంటూ ఇద్దరు అమ్మాయిలు తమకేసి రావడం నేగీ గమనించి, వాళ్ళకేసి ఆశ్చర్యంగా చూశాడు. అక్కడ నేగీని చూసి వాళ్ళూ ఆశ్చర్యపడ్డారు.

చెట్టుకొమ్మ మీద వున్న పిల్లిని చూడగానే ఆ ఇద్దరిలో ఒక అమ్మాయి, దానిని పట్టు కోవటానికి సంతోషంగా ముందుకు అడుగు వేసింది.

నేగీ చప్పున లేచి, ఆమె మీదికి ఉరక బోయిన భూటియాను పట్టి ఇవతలికి లాగాడు.

ఇంకొక యువతి అతన్ని సమీపించి, "ఈ సమయంలో ఇక్కడ ఎవరైనా మనుషులు ఉంటారని మేము అనుకోలేదు. నువ్విక్కడ ఒంటరిగానే ఉన్నావా?" అని అడిగింది.

"ఒంటరిగా కాదు, నాతో నా మేక బుల్ బుల్, భూటియా ఉన్నాయి," అన్నాడు నేగీ.

"నీ పేరేమిటి?" అని అడిగింది ఆ యువతి.

"నేగీ," అన్నాడు వాడు.

నేగీ ఇద్దరు యువతుల కేసి పరిశీలనగా చూశాడు. ఇద్దరూ అందంగా ఉన్నారు. చూడగానే పెద్దమ్మాయి వాడికి ఎంతో నచ్చింది.

"నా పేరు శ్యామా. ఆమె నా చెల్లెలు నీరజ," అంటూ పక్కన వున్న యువతిని చూపింది.

ఆ తరవాత నేగీ వాళ్ళ వెంట ఆ యువతుల ఇంటికి వెళ్ళాడు. ఒక పాత్రను తీసుకుని బుల్‌బుల్ నుంచి పాలు పితికాడు. ఆ తరవాత ముగ్గురూ కూర్చుని, రొట్టెలు తిని, మేకపాలు తాగారు.

కొంతసేపయ్యే సరికి నేగీ ముఖంలో విచారం కనిపించడంతో, శ్యామా, "ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ, విచారపడుతున్నట్టుంది. కారణం ఏమిటి నేగీ," అని అడిగింది.

నేగీ ఏదీ దాచకుండా, తన తండ్రి విధించిన నియమంతో పాటు, తను బయలుదేరి వచ్చిన కథనంతా ఏకరువు పెట్టాడు.

శ్యామా చాలా ఓర్పుగా అంతా విన్నది. నేగీ చెప్పడం పూర్తి చేయగానే, పకపకా

## జిమ్ కార్బెట్ నేషనల్ పార్క్

మన దేశంలోని మొట్టమొదటి నేషనల్ పార్క్, అంటే జాతీయ ఉద్యానం అయిన జిమ్ కార్బెట్ నేషనల్ పార్క్ దాదాపు 520 చదరపు కిలోమీటర్లు విస్తరించి ఉన్నది. ఈ ఉద్యానవనం 1935వ సంవత్సరంలో అప్పటి యునైటెడ్ ప్రావిన్సస్ గవర్నర్ హైలీ పేరు మీదుగా 'హైలీ నేషనల్ పార్క్'గా ఏర్పరచబడింది. ఆ తరవాత 1957వ సంవత్సరంలో సుప్రసిద్ధ ప్రకృతి పరిశీలకుడూ, వేటగాడూ, రచయితా అయిన జిమ్ కార్బెట్ పేరును ఈ పార్క్‌కు పెట్టారు.

కొండలతో నిండిన పౌరీ గర్వాల్, నైనిటాల్ రెండు జిల్లాలలో విస్తరించి వున్నదీ పార్క్. రాంగంగ నదీ తీరంలోని ఈ పార్క్‌లో నదికి ఆనకట్ట కట్టి కృత్రిమ తటాకం నిర్మించి ఉన్నారు. ఆకురాల్చే స్వభావం గల చెట్లతో నిండిన పాడి అడవి సంపన్నమైన జీవ వైవిధ్యానికి నిలయంగా ఉంటోంది. పరిరక్షింపబడుతున్న పులులు, ఏనుగులు, జింకలు, సంచార్ మొదలైన జంతువులతో పాటు 110 జాతులకు పైబడిన చెట్లు 600 జాతుల పక్షులు ఇక్కడ ఉన్నాయి. పులుల సంరక్షణకోసం మన దేశంలోనే ప్రప్రథమంగా 1973వ సంవత్సరంలో 'ప్రాజెక్ట్ టైగర్ పథకం' ఈ పార్క్‌లోనే ప్రారంభించడింది.

నవ్వుతూ, "దీనికింత విచారమెందుకు? పరిష్కారం చాలా సులభం. మేక శరీరం మీది ఉన్నిని మాత్రం కత్తిరించి, వర్తకులకు అమ్మావంటే డబ్బు వస్తుంది. ఉన్నితో వాళ్ళు బట్టలు తయారుచేసుకుంటారు!'' అన్నది.

నేగీకి చిమ్మచీకట్లో మెరుపు మెరిసినట్ట యింది. వాడి మనసు ఆనందంతో ఉప్పొం గింది. తండ్రి నిబంధనను పాటించగలుగు తున్నందుకు వాడు పరమానందం చెందాడు. నేగీ ఎగిరి గంతేసి, "అద్భుతమైన ఆలోచన! నాకు స్ఫురించనే లేదు. చాలా కృతజ్ఞతలు శ్యామా! చాలా కృతజ్ఞతలు!'' అంటూ బుల్ బుల్‌తో అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆ రోజు సాయంకాలానికి పక్క గ్రామం చేరుకుని, బుల్‌బుల్ శరీరంపై నుంచి ఉన్నిని కత్తిరించి గోతాంలో వేసుకుని వ్యాపారుల దగ్గరికి తీసుకువెళ్ళాడు. ఉన్ని మృదువుగానూ, చిక్కులు లేనిదిగానూ, చాలా నాణ్యమైనదిగానూ ఉండడంతో మంచి ధర పలికింది.

మరునాడే, బుల్‌బుల్, భూటియా లను వెంటబెట్టుకుని నేగీ తన ఇంటిని సమీపించాడు. తల్లిదండ్రులు కనిపించ గానే ఆప్యాయంతో వాళ్ళను కౌగిలించు కున్నాడు. ఆ తరవాత బట్టలలో భద్రంగా దాచిన డబ్బును తీసి తండ్రికి ఇచ్చాడు. తమ బిడ్డ, అంత త్వరలో డబ్బుతో తిరిగి వచ్చినందుకు ఆ తల్లిదండ్రులు పరమా నందం చెందారు.

"నాయనా! పరిష్కారం నీకు నువ్వే ఆలోచించావా? లేక నీకెవరైనా సాయ పడ్డారా?'' అని అడిగాడు తండ్రి. "నాన్నా! శ్యామా అనే అమ్మాయి నాకీ చక్కని సలహా ఇచ్చింది. వాళ్ళు కొండకు అవతల ఉన్నారు,'' అన్నాడు నేగీ.

తల్లిదండ్రులు సాలోచనగా ఒకరికొకరు చూసుకున్నారు.

"ఆ అమ్మాయి శ్యామా చాలా తెలివైన దిలా కనిపిస్తోంది. ఆమె మనవాడికి తగిన భార్య. మనం లేకపోయినా, వాడి మంచి చెడులను ఆ అమ్మాయి చూసుకో గలదు,'' అన్నది నేగీ తల్లి భర్తతో.

మరునాడే నేగీ తండ్రి, శ్యామా ఇంటికి వెళ్ళి, వాళ్ళ తల్లిదండ్రులతో మాట్లాడి, నేగీ శ్యామా పెళ్ళి ఏర్పాటుచేశాడు. పెళ్ళయ్యాక వాళ్ళెంతో అన్యోన్యంగా కలిసి మెలిసి ఉంటూ, ఆనందంగా చిరకాలం జీవించారు.

వాళ్ళు ముసలివాళ్ళయ్యాక కూడా - ఒక పిల్లీ, మేకా, కుక్కా కారణంగా తామెలా ఒకరినొకరు కలుసుకున్నదీ, తమ మనుమ లకు తరచూ ఎంతో మురిపెంతో చెప్పుకునే వాళ్ళు!





# ఒంటింటి బిచ్చగాడు

పేరుకుతగ్గట్టే పీనయ్య పిసినారి. కూర్చుని తింటే తరతరాలకు తరగని ఆస్తివుంది. కానీ కూర్చుంటే సంపాదన తగ్గిపోతుందని క్షణం కూడా కూర్చోడు. తింటే ఖర్చెక్కువని సరిగ్గా తినడు.

పీనాసి గుణమైతే వుందికానీ పీనయ్య బుర్ర గట్టిది. ఏ పని చేసినా లోతుగా ఆలోచిస్తాడు. భార్యను జీవితకాలం పోషించాల్సి వస్తుందని, ముందు పెళ్ళి వద్దనుకున్నాడు. ఐతే, ఇంటిపనుల కోసం ఏ పని మనిషిని పెట్టుకున్నా, పని సరిగ్గా చేసేది కాదు. ఏమన్నా అంటే ఎదిరించేది. నెల నెలా జీతమివ్వాల్సి వచ్చినప్పుడు, పీనయ్యకు ప్రాణాలు తోడేసినట్టుండేది. పెళ్ళామైతే, జీతం బత్తెం అడక్కుండా, అన్నమాటకు నోరెత్తకుండా జీవితకాలం తనకు చాకిరీ చేస్తుందని గ్రహించాక, ఆయన పెళ్ళి చేసుకోవాలనే అనుకున్నాడు.

పీనయ్య బాగా డబ్బున్నవాడు కావడంతో, పీనాసి అని తెలిసినా ఆయనకు పిల్లనివ్వడానికి చాలామంది ఆడపిల్ల తల్లిదండ్రులు పోటీపడ్డారు. హెచ్చు మొత్తం కట్నంగా ఇస్తామని ఆశ చూపారు. పీనయ్య దూరమాలోచించాడు. డబ్బున్న పిల్ల అయితే తను చెప్పినమాట వింటుందన్న నమ్మకం లేదు. అదీకాక పెళ్ళి వైభవంగా జరుగుతుంది. ఆడపెళ్ళివారితో పాటు తనకూ బాగానే ఖర్చవుతుంది! ఇలా ఆలోచించి, ఆయన ఒక పేదింటి పిల్లను ఏ అట్టహాసమూ లేకుండా, పైసా ఖర్చు చేయకుండా, కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకున్నాడు.

పీనయ్య భార్య సీత ఎంతో అందమైనది. డబ్బున్న భర్త తనకు పట్టుబట్టలు కట్టబెడతాడనీ, మెడనిండా నగలు దిగేస్తాడనీ, కాలు కిందపెట్టనీయకుండా పనివాళ్ళచేత సేవలు చేయిస్తాడనీ, ఆమె ఆశించింది. కానీ పెళ్ళ

శ్రీరామకమల్



యాక ఆమెకు రోజంతా ఇంటిచాకిరీ ఎక్కువైంది.

సీతకు, తండ్రి పెట్టిన బంగారు గొలుసు ఒక్కటి కూడా మెడలో వేసుకునేందుకు లేకుండా, "ఒంటిమీదుంటే బంగారం అరిగి పోతుంది. పేరంటాలకు వెళ్ళినప్పుడు వేసుకుందువుగానిలే!" అంటూ పీనయ్య ఇనప్పెట్టెలో దాచాడు.

ఇక పీనయ్య, ఆమెకోసం కొన్న చీరలు మహా ముతకవి. తన ఇంట్లో అంత చౌకబారు బట్టలనామె ఎన్నడూ కట్టుకోలేదు.

ఐతే ఒకటి, భార్యను పీనయ్య పొద్దస్తమానమూ తెగ పొగుడుతూండేవాడు. ఆమె ఏం కట్టుకున్నా, ఏ నగలూ లేకున్నా దేవకన్యలా వుంటుందనేవాడు. ఇంటి పనులన్నీ స్వయంగా చేసుకోవడం వల్లనే, ఆమె సన్నగా ఎంతో నాజూగ్గా వుందనే వాడు.

స్వతహాగా సీత అణకువగల అమ్మాయి. అందువల్ల భర్త పొగడ్తలకామె ఉబ్బిపోతూ ఉండేది. అయితే తిండి దగ్గర మాత్రం ఆమెకు సర్దుకుపోవడం కష్టంగా వుండేది.

పీనయ్యకు తిండిమీద ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టడం ఇష్టం లేదు. అయితే, సరిగ్గా తిండి తినకపోతే ఆరోగ్యం పాడై, డబ్బంతా వైద్యానికి ఖర్చుపెట్టాలని భయం. అందు కని కొందరు ఆయుర్వేద వైద్యులను సంప్రదించి, ఆరోగ్యకరమైన ఆహారం గురించిన వివరాలు తెలుసుకున్నాడు. వాటిలో చౌకగా వుండే దినుసుల వివరాలు రాసుకున్నాడు. ఆ ప్రకారం రాగులు, జొన్నలు, ధనియాలు, ఆకుకూరలు వగైరాలతో, రోజుకొక కొత్త రకం వంటకాన్ని కనిపెట్టాడు. అవి తినడం వల్ల శరీరం ఆరోగ్యంగానే వుంటుంది. డబ్బు ఆదాచేయడం తప్ప మరే ఆసక్తీలేని పీనయ్యకు, ఆ భోజనం బాగానే వుండేది కానీ, సీత ఆ భోజనం తినడానికి చాలా బాధపడేది. తినకపోతే ఆమె ఆరోగ్యం పాడవుతుందని, పీనయ్య దగ్గరుండి బలవంతపెట్టి ఆమెచేత తినిపించేవాడు.

ఇలాంటి పరిస్థితిలో సీత, తన భర్తలో మంచి మార్పు వచ్చేందుకు ఏ దేవత అయినా సాయపడితే ఎంత బావుండును అనుకుంటూండేది. ఆమెకు రాత్రివేళ కలలో ఏదో ఒక దేవత కనిపిస్తూండేది. కానీ మెలుకువ వచ్చాక, తనేం కోరిందో, దేవత ఏమన్నదో మాత్రం గుర్తుండేది కాదు.

ఒకరోజు పీనయ్య పనిమీద ఊళ్ళోకి వెళ్ళి, భోజనం వేళకు ఇంటికి తిరిగి వస్తూనే, ఆకలిగా వుందని సీతను భోజనానికి తొందర

పెట్టాడు. ఆ సమయంలో సీత రాత్రి తనకు వచ్చిన ఒక మంచి కలను గుర్తుచేసుకునే ప్రయత్నంలో వున్నది. పైగా ఆకలి కూడా అంతగా లేదు.

ఆమె, భర్తకు భోజనం వడ్డించింది. పీనయ్య ఆమెను కూడా తినమని బలవంత పెట్టాడు. ఆమెకు రాత్రి వచ్చిన కల వెంటనే జ్ఞాపకం రావడంతో, ''రాత్రి కలలో నాకు పార్వతీదేవి కనిపించింది. ఈ రోజు ఒక బిచ్చగాడికి అన్నదానం చేస్తే, మనకు అన్నివిధాలా ఆదాయం పెరుగుతుందిట! అందువల్ల, అన్నదానమంటే మళ్ళీ మనకు అదనపు ఖర్చు కాకూడదని, ఈ పూటకు ఉపవాసం వుండదలిచాను. నా వంతు భోజనం, మీరే ఏ బిచ్చగాడికైనా దానం చేసిరండి,'' అన్నది.



పీనయ్య, భార్య తెలివిని మెచ్చుకుని, తన భోజనం పూర్తికాగానే భార్యవంతు భోజనాన్ని అరిటాకులో పొట్లం కట్టి, బిచ్చగాడిని వెతుక్కుంటూ బయల్దేరాడు. కొంతదూరం వెళ్ళాక ఒకచోట పొదలచాటు నుంచి మూలుగు వినిపించింది. వెళ్ళి చూస్తే, అక్కడ ఒంటింటి బిచ్చగాడు కనిపించాడు.

ఈ ఒంటింటి బిచ్చగాడి గురించి ఊళ్ళో విచిత్రంగా చెప్పుకుంటారు. వాడు రోజుకు ఒక్కపూటే భోంచేస్తాడు. అదీ ఒక్క ఇంటి ముందే అడుక్కుంటాడు. డబ్బులివ్వజూపితే పుచ్చుకోడు. ఆ కారణంగా, అంతా వాడే ఇంటి ముందు అడుక్కుంటే, ఆ ఇంటి వాళ్ళు వాడికి కడుపునిండా మంచి భోజనం పెట్టాలని నిర్ణయించుకున్నారు. వాడేఇంటి భోజనం చేస్తే, ఆ ఇంటివారికి శుభం కలుగుతుందని చాలామందికి నమ్మకం. ఏరోజైనా ఒంటింటి భోజనం మాత్రమే చేస్తాడని, వాడికి ఒంటింటి బిచ్చగాడని పేరొచ్చింది.

ఒంటింటి బిచ్చగాడు, ఏ రోజు ఏ ఇంటిని ఎన్నుకుంటాడో ఎవరికీ తెలియదు. కానీ వాడింతవరకూ ఒక్కసారి కూడా పీనయ్య ఇంట్లో భిక్ష అడగలేదు.

ఆ రోజు ఒంటింటి బిచ్చగాడి భుజం మీది తుండుగుడ్డ గాలికి ఎగిరి పొదలవైపు పడితే, తెచ్చుకునేందుకు వెళ్ళి కాలు మడత పడి కిందపడ్డాడు. తుండుగుడ్డ వాడిచేతి కందిందికానీ కాలు బాగా నొప్పిచేసి లేచి నిలబడ్డం కష్టమైంది. ఆ స్థితిలో పీనయ్య అటు వచ్చాడు.

పీనయ్యను చూస్తూనే బిచ్చగాడు ఆశగా, ''బాబూ! ఆకలితో కడుపు నకనకలాడిపోతున్నది. నీ దగ్గర తినడానికేమైనా వుంటే పెట్టు. అది తిన్నాక, ఏ కర్రనైనా ఊతం



చేసుకుని, ఇక్కడి నుంచి బయటపడతాను,'' అన్నాడు.

బిచ్చగాడెవడైనా దొరుకుతాడా అని ఎదురు చూస్తున్న పీనయ్యకు, వాడిలా అడగ్గానే చాలా ఆనందం కలిగింది. తన భార్య కల నిజమై పోతున్నదని ఆయన సంతోషించి, వాడికి తను తెచ్చిన భోజనం పెట్టాడు.

బిచ్చగాడు ఆత్రంగా ఒక ముద్ద నోట్లో పెట్టుకుని నమిలి మింగి, ''బాబూ! ఆకలి రుచి ఎరగదంటారు. ఐతే, నా కడుపు నకనక లాడుతున్నా కూడా, ఈ ముద్ద విషంలా అనిపించింది. ఈ భోజనం ఎలా తయారు చేశారు, బాబూ!'' అన్నాడు.

పీనయ్య ఆ వంటకమెలా తయారైనదీ వివరించగానే, ''బాబూ! మనిషి కొత్తకొత్త వంటకాలను గొప్ప రుచుల కోసం కనిపెడతాడు. మీరీ వంటకాన్ని ఏం కోరి కనిపెట్టినట్టు?'' అన్నాడు ఒంటింటి బిచ్చగాడు.

''ఈ వంటకంవల్ల ఆరోగ్యం బాగుంటుంది. పైగా ఖర్చు తక్కువ,'' అన్నాడు పీనయ్య.

''అయ్యయ్యో! బిచ్చగాడినైన నేనే ఎన్నడూ ఇలాంటి తిండి తినలేదే! మీరీ తిండి రోజూ ఎలా తినగలుగుతున్నారు?'' అన్నాడు బిచ్చగాడు.

''ఏం చేస్తాం? ఎంత చెట్టుకు అంత గాలి. ఈ జన్మకు నాకిలాంటిభోజనమే రాసి పెట్టివుంది,''అంటూ నిట్టూర్చాడు పీనయ్య.

పెట్టిన తిండి పారవేయకూడదని నియమముండడంవల్ల, బిచ్చగాడు నానా అవస్థా పడి పీనయ్య తెచ్చిన భోజనం తినేశాడు. తర్వాత పీనయ్య సాయంతోనే లేచి నిలబడి, అక్కణ్ణించి నెమ్మదిగా కుంటుకుంటూ వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడు సీత, పీనయ్యకు మామూలు భోజనం కాక రుచికరమైన వంటకాలు వడ్డిం

చింది. పీనయ్య కంగారు పడిపోతూ, "ఈ వంటకాలకు నీకు సరుకులు ఎక్కణ్ణించి వచ్చాయి? మీ పుట్టింటివాళ్ళేమైనా పంపారా?" అని అడిగాడు.

"అలాంటిదేం లేదు. ఒంటింటి బిచ్చగాడు వద్దంటున్నా వాకిట్లో పెట్టి పోయాడు. ఇదంతా నాకొచ్చిన కల ప్రభావమేమో అనుకుంటూ, వాటితో వంట చేశాను," అన్నది సీత తొట్రుపడకుండా.

ఒంటింటి బిచ్చగాడికి భోజనం పెట్టిన ఇంటివాళ్ళకు మేలు జరుగుతుందని, పీనయ్య విని వున్నాడు. ఆయన తనకులాంటి అనుభవం ఇంకెవరికైనా జరిగిందేమో అని వీధిలోకి వెళ్ళి ఒంటింటి బిచ్చగాడిని గురించి అడిగితే, "వాడు ఇంకేం ఒంటింటి బిచ్చగాడు? వాడిప్పుడు చాలా ఇళ్ళల్లో అడుక్కుంటున్నాడు. భోజనమే కాక డబ్బులిచ్చినా వద్దనకుండా తీసుకుంటున్నాడు," అని చెప్పాడొక ఇంటాయన.

ఇన్నాళ్ళూ లేని మార్పు హఠాత్తుగా ఒంటింటి బిచ్చగాడిలో వచ్చినందుకు ఆశ్చర్యపడి వాణ్ణి వెతుకుతూ బయల్దేరాడు, పీనయ్య. వాడు ఊరిచివర చింతచెట్టు కింద కనిపించాడు. పీనయ్య సందేహం విని, "బాబూ! ఆకలితో వున్నప్పుడు, మీరు అన్నం పెట్టి ఆదుకున్నారు. అందుకు మీకు నేనెంతో రుణపడి వున్నాను. అయితే, మీరు తినే తిండి చూస్తే, మీమీద జాలి పుట్టింది. మీ కోసం నాలుగిళ్ళు తిరిగి డబ్బులడుక్కుని, వాటితో వెచ్చాలు కొని, మీ భార్యకిచ్చాను. ఇకనుంచి రోజూ అలాగే చేయాలనుకుంటున్నా. మీరు ప్రతిరోజూ రుచికరమైన భోజనం చేయాలన్నది, నా కోరిక," అన్నాడు.

బిచ్చగాడి మాటలు విన్న పీనయ్యకు తలతీసేసినట్టయింది. ఆయన ఆలోచనలో పడ్డాడు. ఒక్కపూట భోజనం పెట్టినందుకు అడుక్కునేవాడు కూడా ప్రతిఫలం ఇచ్చుకోవాలనుకున్నాడు. తను బిచ్చమెత్తిన డబ్బుల్ని, దాతకే దానం చేస్తున్నాడు. అలాంటిది, ఇంటినిండా డబ్బు మూలుగుతున్నా, తను ఇంటి ఇల్లాలికిగానీ, ఇరుగుపొరుగులకు గానీ ఏం మేలు చేస్తున్నట్టు?

ఆనాటినుంచీ పీనయ్య మారిపోయాడు. ఒంటింటి బిచ్చగాడు తిరిగి ఒంటింటి బిచ్చగాడుగా మారిపోవడమేగాక, పీనయ్య ఇంటి ముందూ అడుక్కోవడం ప్రారంభించాడు.





# దండాల రాముడు

రాముడనేవాడికి, జమీందారు దివాణంలో బంట్రోతుపని దొరికింది. అందుకు సాయ పడిన చలమయ్య వాడితో, "నువ్వు మంచి వాడివే కానీ.మర్యాద తెలియదు నీకు. జమీం దారుగారు కనబడగానే, వెంటనే దణ్ణం పెడుతూండాలని మాత్రం మరిచిపోకు!" అంటూ ప్రత్యేకంగా చెప్పాడు.

ఈ విషయం రాముడు బాగా గుర్తుం చుకున్నాడు. మొదటి రోజున జమీందారు కనపడగానే దణ్ణం పెట్టాడు. ఆయన ఎంతో సంతోషించాడు. ఆయన అక్కడున్నవారితో మాట్లాడుతూ, రాముణ్ణి మళ్ళీ చూశాడు. రాముడాయనకు మళ్ళీ దణ్ణం పెట్టాడు.

జమీందారు వాడి వినయానికి సంతో షించి పిలిచి ఏదో పని చెప్పాడు. పని ముగిం చుకుని వచ్చి రాముడు, జమీందారుకు మళ్ళీ దణ్ణంపెట్టి, పని అయినట్టు చెప్పాడు.

అలా వాడు జమీందారు కనబడినప్పుడల్లా దణ్ణం పెట్టడం అలవాటు చేసుకున్నాడు. జమీందారు వాడికి ప్రతిరోజూ చాలాసార్లే కనబడేవాడు. అంతేకాదు, జమీందారు అటు పక్కకు తిరిగి ఎవరితోనో మాట్లాడి, మళ్ళీ రాముడి వైపు తిరగ్గానే, వాడు వెంటనే ఆయ నకు దణ్ణం పెట్టేవాడు.

జమీందారు వాడి వినయానికి మెచ్చి, తనకు అంగరక్షకుడుగా నియమించాడు. అప్పటినుంచీ వాడు, జమీందారును వెన్నంటే వుండసాగాడు. మామూలుగా జమీందారు ముందు నడుస్తూంటే, రాముడు వెనకాలే నడిచేవాడు. వాడితో ఏమైనా చెప్పాలని తల వెనక్కు తిప్పితే, రాముడు వెంటనే ఆయనకు దణ్ణం పెట్టేవాడు. ఏదైనా ఆలోచిస్తున్నప్పుడు జమీందారుకు అటూ ఇటూ పచార్లు చేయ డంఅలవాటు. రాముడు అక్కడే నిలబడి ఆయన వెనక్కు తిరిగి తనవైపుకు వచ్చిన ప్పుడల్లా, వాడాయనకు దణ్ణం పెట్టేవాడు.

ఒకసారి జమీందారుకు మెడనొప్పి చేసింది. మెడకు వ్యాయామం కావాలనీ, రోజూ కాసేపు

ఆయనమెడను కుడిపక్కకూ, ఎడమపక్కకూ తిప్పుతూండాలనీ వైద్యుడు చెప్పాడు. అలాంటి సమయాల్లో రాముడు, ఆయన కుడి పక్కనే వుండి, ఆయన తలను కుడి పక్కకు తిప్పిన ప్పుడల్లా, దణ్ణం పెట్టేవాడు.

రాముడి దణ్ణాల గురించి దివాణంలో అందరికీ తెలిసిపోయింది. కానీ ఎవరూ వాణ్ణి వేళాకోళం చేసేవారు కాదు. ఎందుకంటే, వాడు దణ్ణాలు పెడుతున్నది సాక్షాత్తు జమీం దారుకు. జమీందారు కూడా దణ్ణాలు వద్దని రాముడికి చెప్పలేదు. చూస్తూ చూస్తూ తనకు లభించే దణ్ణాలను తగ్గించుకోవడం, ఏ ప్రభువుకు మాత్రం ఇష్టముంటుంది?

ఒకరోజు తెల్లవారుజామున జమీందారు ఊరుకు సమీపంలో వున్న పొలాలకేసి వెళుతున్నాడు. రాముడాయనను అనుసరించి నడుస్తున్నాడు. అలా కొంతదూరం వెళ్ళాక ఉన్నట్టుండి దొంగ ఒకడు వెనకనుంచి వచ్చి రాముడి కాలిమీద తన్నాడు. రాముడు కిమ్మనకుండా కిందపడ్డాడు. అదే అదనుగా దొంగ ముందుకు వెళ్ళి జమీందారు మెడ లోని గొలుసును గుంజుకున్నాడు. ఆయన ఉలిక్కిపడి వెనక్కు చూస్తే, కిందపడి వున్న రాముడాయనకు దణ్ణం పెట్టాడు.

రాముడు లేచేస్థితిలో లేడని, జమీందారు తనే దొంగ వెంట పడుతూ, "ఒరేయ్, రాముడూ! తొందరగా లేచి దొంగను పట్టుకో!" అని కేకపెట్టాడు. ఆ కేక వింటూనే రాముడు లేచి నిలబడ్డాడు. వాడు పరుగు పరుగున పోయి, దొంగను పట్టుకునేందుకు రెండు చేతులూ సాచాడు. అయితే, దొంగ, రాముణ్ణి తప్పుకుని పక్కనుంచి పరిగెత్తబోయాడు.



రాముడు పక్కకు కదిలి వాణ్ణి ఆపేవాడే! కానీ ఆ సమయంలో దొంగకేసి వస్తున్న జమీందారు కనిపించాడు. అంతే! రాముడు అప్రయత్నంగా రెండు చేతులూ జోడించి ఆయనకు దణ్ణం పెట్టాడు. అది అవకాశంగా తీసుకుని దొంగ శరవేగంతో పారిపోయాడు.

జమీందారుకు చాలా కోపం వచ్చింది. చేజేతులా దొంగను విడిచిపెట్టేశాడని, రాము ణ్ణాయన బాగా మందలించాడు.

ఐతే, రాముడు చేతులు జోడించి, "అయ్యా! తమరు కనబడితే దణ్ణం పెట్ట కుండా వుండలేను. అందువల్లనే దొంగ తప్పించుకుని పారిపోయాడు. నేను దణ్ణం పెట్టడం తప్పయితే చెప్పండి. అలవాటు మానుకునేందుకు ప్రయత్నిస్తాను," అన్నాడు.

"నీ దణ్ణం వల్ల, మూడు కాసుల బంగారు గొలుసు పోయింది!" అన్నాడు జమీందారు కాస్త కోపంగా.



వెంటనే రాముడు, ''ఆ దొంగ ముఖం నేను చూశాను. వాడు మనూరివాడే; పేరు తెలియదు. మళ్ళీ చూస్తే గుర్తుపట్టగలను. కాబట్టి తమరు చాటింపు వేయించండి. రాముడు, దొంగను గుర్తుపట్టాడనీ, మర్యాదగా గొలుసు ఇచ్చేస్తే, తమరీ విషయాన్ని అంతటితో వదిలిపెట్టేస్తారనీ, లేకుంటే ఊరందర్నీ సమావేశపరిచి, అసలు దొంగను పట్టి కఠినంగా శిక్షిస్తాననీ ఊరివాళ్ళకు తెలియజేయండి,'' అన్నాడు.

జమీందారు ఆ విధంగా చాటింపు వేయించాడు. మర్నాటికల్లా ఎలా వచ్చిందో, ఆ గొలుసు జమీందారు పట్టెమంచం మీద పడివున్నది.

జమీందారు, రాముడి సలహాను మెచ్చుకుని, ''నా గొలుసు నాకు దొరికిందికానీ, దొంగ ఎవడో వాడికి నా కొలువులో పనిచేసే వాళ్ళతో పరిచయముంది. నువ్వెలాగైనా అలా వాణ్ణి గుర్తుపట్టి, నాకు తెలియజెయ్యి!'' అన్నాడు.

దానికి రాముడు ఒక క్షణం తటపటాయించి, ''అయ్యా! నిజానికి నేను దొంగ ముఖం సరిగ్గా చూడలేదు. నా దణ్ణంవల్ల తమరి గొలుసు పోయిందని బాధపడి - తమరిక నన్ను దణ్ణం పెట్టనివ్వరేమోనన్న దిగులుతో, మెదడుకు బాగా పదునుపెట్టి, ఆ ఉపాయం ఆలోచించాను. నేను దొంగను గుర్తుపట్టలేనని నాకు తెలుసుకానీ, దొంగకు తెలియదు కదా! పట్టుబడితే తమరు కఠినంగా శిక్షిస్తారని భయపడి, వాడు గొలుసును తమకు చేరే ఏర్పాటు చేశాడు,'' అన్నాడు.

''నీ చేతులకు దణ్ణాలేకాదు, నీ బుర్రలో ఉపాయాలూ దండిగానేవున్నవి. నువ్వు దొంగను సరిగ్గా చూడనప్పుడు, విషయం నాకైనా చెప్పలేదేం?'' అని అడిగాడు జమీందారు.

''అయ్యా! అసలే తమరు నా మీద కోపంగా ఉన్నారు. అప్పుడు దొంగ ముఖం చూడలేదని చెప్పడం మంచిది కాదు. అదీకాక నేను దొంగముఖం చూశానన్నాను కాబట్టే తమరు చాటింపు వేయించారు! లేకుంటే తమరు నా ఉపాయం మీద నమ్మకముంచే వారు కాదు,'' అన్నాడు రాముడు.

జమీందారు వాడి తెలివినీ, సమయస్ఫూర్తినీ మెచ్చుకుని, ''ఒరేయ్, నాకిప్పుడెంతో సంతోషంగా ఉంది. నువ్వు వంటశాలకు వెళ్ళి, ఈ రోజు భోజనంలోకి రెండు రకాల తీపి పదార్థాలు చెయ్యమన్నానని, నా మాటగా చెప్పు,'' అన్నాడు.

రాముడు వంటశాలకు వెళ్ళి, ఆ విషయం చెబితే వంటవాడు సరేనని, ''ఇప్పటికే పూర్ణం

బూరెలు చేశాను. రుచి చూసి ఎలాగున్నాయో చెప్పు!'' అంటూ వాడికొక బూరె ఇచ్చాడు.

రాముడది తిని ఆశ్చర్యపోయాడు. అలాంటి రుచికరమైన బూరె అంతవరకూ వాడెక్కడా తిని వుండలేదు. ఇంకొకటడిగి తినాలనిపించినా మొహమాటం కొద్దీ వూరుకున్నాడు. అయితే, వాడి అదృష్టం కొద్దీ తన దగ్గరకు తిరిగి వచ్చినవాణ్ణి, కొద్ది క్షణాలకే మళ్ళీ జమీందారు వంటశాలకు పంపాడు. వంటవాడు వాడికి ఇంకొక బూరె రుచి చూపించాడు.

ఆ రోజు జమీందారుకేమయిందో రాముణ్ణి ఆగకుండా వంటశాలకు పంపుతూనే వున్నాడు. వెళ్ళినప్పుడల్లా రాముడికి వంటవాడొక బూరె రుచి చూపించసాగాడు. పదీ పన్నెండు బూరెలు తినేసరికి రాముడికి మొహం మొత్తి ఇంక వద్దన్నాడు.

''వద్దనకూడదు. ఇది నాకు జమీందారు గారి ఆజ్ఞ!'' అన్నాడు వంటవాడు.

''అస్తమానూ బూరెలే తినలేకపోతున్నాను. పోనీ ఇంకేమైనారుచి చూపించు!'' అని రాముడు, వంటవాణ్ణి వేడుకున్నాడు.

''ఏమో మరి, జమీందారుగారు నీకు బూరెలే రుచి చూపించమన్నారు. మరేమైనా వంటకం కావాలంటే పోయి ఆయన్నే అడుగు,'' అన్నాడు వంటవాడు విసుగ్గా.

రాముడు మరి బూరెలు తినలేక, జమీందారు దగ్గరకు వెళ్ళి, ఆ సంగతి చెప్పాడు.

''బూరెలు నీకు చాలా ఇష్టం కదా?'' అన్నాడు జమీందారు.

''అయ్యా! ఇష్టమేకానీ ఒకే రోజున అన్ని తింటేమొహం మొత్తుతుందికదా!'' అన్నాడు రాముడు.

ఆ జవాబు విని జమీందారు చిరునవ్వు నవ్వి, ''ఒరే, నువ్వు నా మనసుకు ఆహ్లాదం కలిగించాలని దణ్ణాలు పెడుతున్నావు, అది నాకిష్టం. నేను నీ పొట్టకు ఆహ్లాదం కలిగించాలని బూరెలు పెట్టించాను, అవి నీకిష్టం. మనసుకైనా మనిషికైనా మితిమీరితే మొహం మొత్తుతుంది. తెలుసుకున్నావు కదా!'' అన్నాడు జమీందారు.

అప్పటికి రాముడికి అసలు విషయం అర్థమైంది. ఆ రోజునుంచీ వాడు, జమీందారుకు రోజుకు ఒకటి రెండుసార్లే దణ్ణం పెడుతూ పరిమితిని పాటించసాగాడు. అయితే, వాడికి దండాల రాముడు అన్న పేరు మాత్రం అలాగే వుండిపోయింది.



# మన దేశం గురించి తెలుసుకుందాం!

1. మనదేశంలోని ఒక రాష్ట్ర చిత్ర పటం ఇది. అయితే ముద్రణలో ఉత్తర దక్షిణాలు సరిగా లేవు. ఈ రాష్ట్రం పేరేమిటి? రాజధాని ఏది?



2. ప్రస్తుతం మన దేశంలో అతి పెద్ద రాష్ట్రం ఏది?
   ఎ) ఉత్తరప్రదేశ్, బి) మధ్యప్రదేశ్
   సి) రాజస్థాన్, డి) ఆంధ్రప్రదేశ్
3. దేశ రాజధాని కలకత్తా నుంచి ఢిల్లీకి మార్చినప్పుడు భారత వైస్రాయ్ ఎవరు?
   ఎ) లార్డ్ కర్జన్
   బి) లార్డ్ హార్డింజ్
   సి) లార్డ్ వావెల్
   డి) లార్డ్ డల్హౌసీ
4. 'చిప్కో' ఉద్యమాన్ని ప్రారంభించిన వారెవరు?
   ఎ) మేనకాగాంధీ
   బి) అరుంధతీరాయ్
   సి) మేథాపట్కర్
   డి) సుందర్‌లాల్ బహుగుణ
5. హైదరాబాద్‌కు ముందు ఆంధ్ర రాష్ట్ర రాజధాని ఏది?
   ఎ) నెల్లూరు
   బి) కర్నూలు
   సి) విజయవాడ
   డి) విశాఖపట్నం
6. జలియన్ వాలా దురంతాలు మనసును కలచివేయడంతో, రవీంద్రనాథ టాగూర్, బ్రిటిష్ ప్రభుత్వం ప్రదానం చేసిన 'నైట్ హుడ్'ను తిప్పి ఇచ్చేశారు. ఆ దురంతం ఎప్పుడు జరిగింది?
   ఎ) 1919 బి) 1922
   సి) 1924 డి) 1927

(సమాధానాలు వచ్చే సంచికలో)

## సెప్టెంబర్ క్విజ్ సమాధానాలు

1. సి) i ; ఎ) ii ; బి) iii
2. న్యాయవాది
3. కార్టూనిస్ట్ శంకర్
4. యు.ఎస్.ఎస్.ఆర్.
5. 49 సంవత్సరాలు
6. సమాచార - ప్రసార శాఖ మంత్రి
7. బ్యాంకుల జాతీయీకరణ.
8. 1980



# విఘ్నేశ్వరుడు

అవ్వ ఒక రోజున ఫలవృక్షాలతో నిండి వున్న మార్గం గుండా వెళ్తూండగా ఒక అందమైన బాలకుడు చెట్టుమీద కూర్చుని పాడు కుంటున్నాడు. చెట్టు నిండా పళ్ళు విరగ పండి వున్నవి.

ఆ కుర్రవాణ్ణి పలకరించి మాట్లాడాలని అవ్వకు బుద్ధిపుట్టింది. ''నాయనా! ఒక పండు ఇలా పడెయ్యవూ! నోరూరుతున్నది,'' అని అన్నది.

బాలుడు నవ్వుతూ, ''అవ్వా! ఏ పండు కావాలి? చెట్టు నిండా రకరకాల పళ్ళున్నవి. ముసలితనాన్ని పోగొట్టే పండు ఇమ్మం టావా? మృత్యువును దూరంచేసే పండా? ధనరాసుల్నిచ్చే పండా? ఎలాంటి పండు కావాలి?'' అన్నాడు.

అవ్వకు ఆ బాలుడు సుబ్రహ్మణ్యేశ్వ రుడే అని తెలిసిపోయింది. ఆమె చేతులెత్తి మ్రొక్కుతూ, ''సుబ్రహ్మణ్యస్వామీ! ఎంత పంచినా తరగని అపార జ్ఞాన సంపదనిచ్చే పండు ఇవ్వు, తండ్రీ! జ్ఞానఫలాన్ని అనుగ్ర హించు!'' అంటూ సాగిలపడింది.

సుబ్రహ్మణ్యస్వామి నిజరూపంతో దండాన్ని ధరించి నెమలిపై సాక్షాత్కరించాడు. అవ్వ శిరస్సు బళ్ళెపు మొనతో సుతారంగా తాకి అనుగ్రహించాడు. అవ్వకు ఒక్కసారిగా విశ్వ స్వరూపమైన ఓంకారతత్వము, బ్రహ్మ జ్ఞానము, జీవన్ముక్తిమార్గము తెలిసి అపార మైన జ్ఞానం కలిగింది. సుబ్రహ్మణ్యేశ్వరుడు అవ్వను ఆశీర్వదించి ఆ క్షణమే అంతర్ధాన మయ్యాడు.

అవ్వ కాలినడకను ఊరూరా, వాడవాడా జ్ఞానాన్ని, భక్తిని, ఉత్తమ జీవన ధర్మాలను సామాన్యులకు తెలిసే మాటలలో ప్రబో ధిస్తూ దేశ సంచారం చేసింది.



అవ్వ నోటి నుంచి వచ్చిన మధుర వాక్కులు, కవితలాగ గీతాలై ప్రజాసామాన్యంలో వ్యాప్తిపొంది చిరస్థాయిగా నిలిచాయి.

అవ్వ అలా వెళ్తూ చీకటి పడ్డ వేళకు ఒక అరణ్య మార్గానికి వచ్చింది. ఆకాశంలో మేఘాలు దట్టంగా క్రమ్ముకొచ్చాయి. చిట్ట చీకటిగా ఉంది. ఉండి ఉండి మెరుస్తున్నది. తుప్పర పడుతున్నది. అవ్వ కాలికి రాయి తగిలి పడిపోయింది. చేతనున్న ఊతకర్ర దూరంగా పడింది.

ఆ చీకటిలో ఎవరో వస్తున్న పాదధ్వని మధురంగా వినిపించింది. అవ్వ తల ఎత్తి చూసింది. అప్పుడే మెరిసింది. మెరుపు వెలుగులో ముద్దుగా, బొద్దుగా దోరపు బొజ్జతో ఒక బాలుడు కనిపించాడు. ఆ బాలుడు అవ్వను లేవనెత్తి కర్ర తెచ్చి అందించాడు. అవ్వ పట్టిన కర్రను బాలుడు కదలకుండా పట్టుకుని, ''అవ్వా! ఎక్కడికి వెళ్తున్నావు? ఏ క్షేత్రం చూడాలని వెళ్తున్నావు? ఏ తీర్థం సేవిస్తావు?'' అని అడిగాడు.

''నాయనా! నాకు ఈ పుడమి అంతా ఒకే ఒక దివ్యక్షేత్రం. ప్రత్యేకంగా క్షేత్రాలు, తీర్థాలు సేవించాలని నాకు లేదుగాని నేను చేరవలసిన క్షేత్రాన్ని ఎలాగ చేరాలో దారి కనిపించడంలేదు. ఇంతకూ నువ్వెవరో ఏమిటో! పసివాడివి ఈ చీకటిలో వస్తున్నావెందుకు?'' అని అవ్వ అన్నది.

''అవ్వా! నేను నీ ఆబాల్య సన్నిహితుణ్ణి. పుట్టినప్పటి నుంచీ నన్నెరిగున్నదానివే, చీకటిలో గుర్తించలేకపోతున్నావు! ఇంతకూ నువ్వు చేరాలనుకుంటున్న ఆ క్షేత్రం ఏమిటో చెప్పావు కాదు!'' అన్నాడు ఆ బాలుడు.

''చెప్పి ఏం లాభం! తీసుకెళ్తావా? అది శివసన్నిధానం అనే మహాక్షేత్రం!'' అన్నది అవ్వ.

''ఓష్! ఈ మాత్రం దానికేనా, అదెంత పని నాకు! నీ చెయ్యి పట్టుకుని తీసుకెళ్తాను పద!'' అంటూ బాలుడు అవ్వ చేతిని పట్టుకుని అడుగు వేశాడు. రెండో చేత ఊతకర్రతో అవ్వ అడుగు ముందుకు వేయబోతుండగా పెద్ద మెరుపు మెరిసింది. ఆ కాంతిలో తన చేతిని తొండంతో పట్టుకుని నడిపించే విఘ్నేశ్వరుణ్ణి చూసి అవ్వ కన్నులు మూసి, ''దేవా! చిన్ననాటి నుంచీ నువ్వే నడిపిస్తున్నావు, నేను కన్నులు మూసుకున్నా తెరిచినా ఒకటే!'' అని అనుకుంటూ కళ్ళు తెరవకుండానే విఘ్నేశ్వరుడు ఎక్కిస్తూ తీసుకెళ్తుంటే ఎన్నో ఎన్నో మెట్లు ఎక్కుతూ, అలా ఎంత కాలం గడిచిందో తెలీకుండా వెళ్ళింది.

అలా వెళ్ళగా వెళ్ళగా, "అవ్వా! శివసాన్ని ధ్యాన్ని సమీపించాము!" అని అన్న విఘ్నేశ్వరుడి మాటకు అవ్వ కన్నులుతెరిచి చూసింది.

అక్కడ వెలుగు తప్ప మరేమీ కనిపించ లేదు. కిందికి చూస్తే అనేక నక్షత్ర మండల సముదాయాలు సోపాన పంక్తుల్లాగ కనిపించాయి. ఎన్నెన్నో సూర్యకుటుంబాలు, తోక చుక్కలు, వాయురూపంలో తిరుగుతూ పెరుగుతూన్న జ్యోతులు, వెలుగు చక్రాల్లాగ గిర్రున తిరుగుతున్న తేజో మండలాలతో నిండిన అనంత విశ్వం పాదాల దిగువ కన్నుల పండువుగా వున్నది.

విఘ్నేశ్వరుడు అవ్వచేతినివదిలి, "అవ్వా! శివసన్నిధానాన్ని చేరుకున్నావు. ఇక్కడ కాలం అనేది లేదు. నాశము అనేది లేదు. ఇదే సృష్టి స్థితి లయాలకు అతీతమైన శివుని సన్నిధానం, అసలు కైలాసం! విశ్వనాథుడు విశ్వేశ్వరుడైన శివుణ్ణి దర్శించు!" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

అవ్వకు లింగాకారంగా మీదకూ కిందకూ ఒకేలాగ వ్యాపించి వున్న గొప్ప జ్యోతి కనిపించింది. ఆ జ్యోతిలో ప్రమథ గణాలు చేస్తున్న స్తోత్రం ఓంకార ధ్వనిగా వినిపిస్తున్నది. విశ్వేశ్వరుడైన శివుడు కనిపించాడు. అతని కిరుపక్కలా, విఘ్నేశ్వరుడు, పార్వతి, కుమార స్వామి, నంది మొదలైన వారంతా ఉన్నారు.

అవ్వకు శివ సాక్షాత్కారమైంది. శివుడు ప్రీతితో తన అభయ హస్తాన్ని అవ్వ తలపై వుంచి అనుగ్రహించాడు. ఆ విధంగా అవ్వ శివసాయుజ్యాన్ని పొందింది.

మంటప చిత్రాల్లో, చెరుకుగడ పట్టివున్న విఘ్నేశ్వరుడిని ఒక రైతు కుతూహలంగా



చూస్తూండడం గమనించి పావనమిశ్రుడు కథ ఆరంభించాడు:

రాజంతటి భూస్వామి ఒకడు ఏటేటా వినాయక పూజలు, ఉత్సవాలు ఘనంగా జరిపిస్తూ, గణేశ భక్తశిరోమణి అనిపించుకున్నాడు. అతనికి అనేక పంట పొలాలతో పాటు పెద్ద చెరుకు తోట ఉంది.

ఆ చెరుకుతోట పని అంతా చూసుకుంటూ ప్రతి ఏటా పుష్కలంగా చెరుకు పండించి భూస్వామికి మంచి రాబడి చేకూర్చే పాలేరు, మనస్సులో విఘ్నేశ్వరుణ్ణి నమ్మిన భక్తుడు. "ఈసారి మరింత బాగా పండించు గణేశా!" అని మనస్సులో మొక్కుతూ చెరుకు నాటి ఏడాదికేడాది తన యజమానికి మరింత లాభం చూపించేవాడు.

పాలేరూ అతని భార్యా, పదేళ్ళ కొడుకూ ముగ్గురూ చెమటోడ్చి పని చేసేవారు. భూస్వామి మాత్రం చాలా తగ్గించి కూలి



ఇచ్చేవాడు, అదీ సరిగా ఇచ్చేవాడు కాదు. పాలేరు అమాయకుడు, అల్పసంతోషి. ఏమీ అనేవాడు కాడు.

భూస్వామి భార్య ఉత్తమురాలు. మంచి అయినా చెడ్డ అయినా మనస్సులో గణేశుడికే నివేదించుకునేది. పాలేరుకి కూలి ఇవ్వడంలో భర్త మరీ అన్యాయం చేస్తూంటే, ''పాపం, వాళ్ళు పడే కష్టానికి మీరిచ్చేది ఏ మాత్రం? సరిగా ఇవ్వండి!'' అనేది.

''బాగానే ఉంది నీ బోడి సలహా! ఇలా మిగుల్చుకుంటూ వస్తేనే గదా మనం గణేశ ఉత్సవాలు జరిపించేది!'' అనేవాడు భూస్వామి.

ఆమె ''కష్టపడేవాళ్ళ నోట మట్టిగొట్టి పూజలూ, ఉత్సవాలూ జరపకపోతేనేం? గణేశా, ఈయనకు మంచి బుద్ధి కలిగించు!'' అని అనుకునేది.

ఆ ఏడాది చెరుకు ఏనుగు తొండాల్లాగ మరింత విశేషంగా పండింది. వెయ్యేసి చెరుకులు కట్టిన మోపులు బళ్ళతో భూస్వామి దివాణం చేరుతున్నాయి.

''అంతా గణేశ్వరుడి దయ. ఊరికే పోతాయా, పూజలూ, ఉత్సవాలూ. మరి దేనికి చేయిస్తున్నాం!'' అన్నాడు భూస్వామి.

''అంతేగాని మన పాలేరు శ్రమ ఏమీ లేదంటారు, అంతేనా?'' అని భార్య అన్నది.

''బాగానే ఉంది నీ వల్లమాలిన జాలి! అలా పాలేర్లనూ, జీతగాళ్ళనూ వెనకేసుకొస్తే మనం కూడా వాళ్ళ వెనక్కే వెళ్ళవలసి ఉంటుంది. ఈ మనుషుల్లో ఏముంది, అంతా ఆ వినాయక దేవుడి మహిమ!'' అన్నాడు భర్త.

''ఓ విఘ్నేశ్వరా! ఈయనకు జ్ఞానోదయం కలిగించవలసింది నీవే!'' అని ఆమె మనసులో ప్రార్థించింది.

పాలేరు కొడుక్కి విఘ్నేశ్వరుడంటే ప్రాణం. వినాయక చవితికి తెల్ల కలువలూ, ఎర్ర తామరలూ, పూలూ, పత్రీ ప్రతి ఇంటికీ పూజకు తెచ్చి ఇచ్చేవాడు.

వినాయక చవితి వచ్చింది. కుర్రవాడి ప్రాయంతో పాటు బుద్ధి కూడా ఎదుగుతున్నదేమో, వాడు చెరుకు మోపుల్ని భూస్వామి దివాణానికి చేరవేయిస్తున్న తండ్రి దగ్గర కెళ్ళి, ''నాన్నా, మనం కూడా వినాయకుడికి పెట్టుకుందాం, ఒక చెరుకుగడ తీసుకెళ్తా!'' అన్నాడు.

పాలేరు ఒక చెరుకు తీసి కొడుక్కిచ్చాడు. వాడు దాన్ని ఇంటికి తీసుకెళ్తున్నాడు. అది భూస్వామి కంటబడింది.

భూస్వామి ఉగ్రనరసింహావతారుడై, ''ఏమిరా, నా చెరుకంతా నీ ఇంటికి

చేరవేయిస్తున్నావా?'' అంటూ పాలేరుపై విరుచుకుపడి నానా మాటలూ అంటూ, కొరడాతో కొడుతూంటే, భూస్వామి వెంట నున్న పరివారమూ, గ్రామస్థులూ చూస్తూ ఊరుకున్నారేగాని కిక్కురుమనలేదు. భూస్వామి పలుకుబడి అలాంటిది! అతడేం చేసినా చెల్లుతుంది. ఎదురు తిరిగి అడిగేవాడు లేడు.

పాలేరు తాళుకోలేక, ''చవితి కదా వినాయకుడికి పెట్టుకుందామని పట్టుకెళ్ళమని ఇచ్చాను, ఒక్కటంటేఒక్క చెరుకు!'' అన్నాడు.

భూస్వామి, ''ఏమిటీ! మీ జాతి తక్కువ వాళ్ళకి పూజలూ, వినాయకుడూనా?'' అన్నాడు.

పాలేరు, ''కడజాతి అయితే అయింది గాని, దేవుడూ భక్తీ ఉండవా?'' అన్నాడు.

భూస్వామి హేళనగా, ''నీ ముఖానికి భక్తి కూడానా! నక్కకూ, నాగలోకానికీ ఉన్నంత దూరం! చెరుగ్గెడ పట్రా!'' అన్నాడు.

పాలేరు, ''ఒక్క చెరుకు కోసం అలా రాపాడిపోతారేమయ్యా? బళ్ళతో చెరుకు దింపుకున్నది చాలదా, ఒక్క చెరుకుతో ఏం బావుకుంటావయ్యా?'' అన్నాడు.

భూస్వామి, ''ఎంత మాట కూశావురా! ఒకటి కాదు పది కాదు వెయ్యి చెరుకులైనా నాకు పూచికతో సమానం తెలుసా! తెల్లవారే సరికి నువ్వు వెయ్యి చెరుకులు తినాలి! నమిలిన పిప్పి అంతా పోగు కనిపించాలి!



లేకుంటే చెరుకొక్కింటికి వెయ్యి కొరడా దెబ్బలు తింటావు తెలిసిందా!'' అంటూ పాలేరును పెడరెక్కలు విరిచి కట్టించి, భృత్యులచేత వాణ్ణి బందీలాగ చెరుకు నిలవ చేసే సాలలో త్రోయించి వెయ్యి చెరుకుల మోపు వాడి ముందు పడవేయించాడు.

భూస్వామి గొప్ప తిక్కమనిషి. ఎంత తోస్తే అంత. పాలేరును ఉంచిన సాల చుట్టూరా భటుల్ని కాపలా పెట్టాడు.

భూస్వామి భార్య, ''విఘ్నేశా! పాలేరు ఉత్త అమాయకుడు. చెరుకు తినడానికి పూనుకుంటే పాపం నిష్కారణంగా చస్తాడు. తినకపోతే నా భర్త దెబ్బలు కొడతాడు. వాణ్ణి ఎలాగ కాపాడతావో మరి!'' అని మనసులో అనుకుంది.

పాలేరుకి ఏమీ తోచలేదు. చేసేది లేక విఘ్నేశ్వరుణ్ణి తలచుకుంటూ, చీకటి పడే వేళకు అలాగే నిద్రలో పడిపోయాడు.

తెల్లవారుతూనే భూస్వామి వెళ్ళిచూస్తే, తెల్లగా హిమాలయ పర్వతం లాగ చెరుకు పిప్పిపోగు కనిపించింది. భూస్వామి దెయ్యం పట్టినవాడిలాగ పెద్ద కేక పెట్టి తెరిచిన నోరు తెరిచినట్టే ఉండిపోయాడు.

ఆ కేక విని వచ్చిన భార్యతో భూస్వామి, ''అంతా సర్వనాశనం! సాలలో ఒక్క చెరుకు మిగలకుండా అంతా పిప్పి పిప్పి! పాలేరు కాడు, భూతం! వాడు మనల్ని తినేస్తాడు పద!'' అంటూ అరుస్తూంటే, ఆమె నవ్వి, ''వాడు భూతమూ కాదు, తిననూ లేదు! నేను కళ్ళారా చూశాను. అప్పటికింకా తెల్లారలేదు. ఏనుగు ఘీంకారం విని, కిటికీ లోంచి చూశాను. పెద్ద ఏనుగు చెరుకు మేస్తూ కనిపించి మాయమైంది!'' అన్నది.

''ఏనుగేమిటి, నీ మొహం! ఈ చుట్టు పక్కల ఏనుగన్నది ఉన్నట్టు వినలేదు,'' అని భూస్వామి అంటూండగా, కొంత మంది వినాయక ఉత్సవశాల నుంచి పరుగున వచ్చి, ''రాత్రి నుంచీ పందిట్లో పూజలో పెట్టిన వినాయక విగ్రహం కనిపించటంలేదు. అంతటా వెతికాము,'' అని చెప్తూనే సాలలోకి చూస్తూ, ''అదుగో, విగ్రహం, అదుగో!'' అంటూ అటుకేసి వెళ్ళారు.



పువ్వు పుట్టగానే....

# నిజంకోసం!

అది ఒక ప్రాథమిక పాఠశాల. పిల్లల అల్లరితో గందరగోళంగా ఉంది. తరగతిలోకి అడుగు పెట్టిన ఉపాధ్యాయుడు అక్కడ పడివున్న వేరుశనగ తొక్కలను చూసి మండిపడి, "ఏమిటిదంతా? ఎవరీ పనిచేసింది? ఇదా మీరు తరగతిని శుభ్రంగా చూసుకునేపద్ధతి? వేరుశనక్కాయలు తిన్న వాళ్ళందరూ వీటిని ఏరండి," అని పురమాయించాడు.

ఒక్క కుర్రవాడు తప్ప తక్కిన పిల్లలందరూ ముందుకు వంగి చకచకా తొక్కలను ఏరసాగారు. దానిని గమనించిన ఉపాధ్యాయుడు ఆ కుర్రవాడితో, "తమరిని ప్రత్యేకంగా ఆహ్వానించాలా ఏం?" అన్నాడు.

కుర్రవాడు లేచి నిలబడి, "నేను వేరుశన క్కాయలు తిని తొక్కలు వేయలేదు. అలాంటప్పుడు నేను తొక్కలను ఏరవలసిన అవసరం లేదుకదా?" అని ఎదురుప్రశ్న వేశాడు.

"కాదండీ. వాడూ వేరుశనక్కాయలు తిన్నాడు," అన్నారు మిగిలిన పిల్లందరూ బృందగానం లాగా. అయితే, ఆ ఒక్క కుర్రవాడు మాత్రం, "లేదు, నేను తినలేదు," అన్నాడు దృఢమైన కంఠస్వరంతో.

ఉపాధ్యాయుడు, "అంటే, తరగతిలోని పిల్లలందరూ అబద్ధం చెబుతున్నారు. తమరు ఒక్కరే మాత్రమే నిజం చెబుతున్నారు! అంతేకదా?" అన్నాడు వ్యంగ్యంగా.

"అవును!" అన్నాడు కుర్రవాడు నిర్భయంగా. ఉపాధ్యాయుడు కోపంతో బెత్తం అందుకుని కుర్రవాడి అరచేతిలో నాలుగు తగిలించాడు. కుర్రవాడు నిబ్బరంగా శిక్షను అనుభవించి, పుస్తకాలు తీసుకుని మౌనంగా వెలుపలికి నడిచాడు. మిగిలిన విద్యార్థులూ, ఉపాధ్యాయుడూ ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయారు.

ఆ రోజు సాయంకాలం ఉపాధ్యాయుడు, ఆ కుర్రవాడి ఇంటికివెళ్ళి, తరగతిలో జరిగినసంగతిని కుర్రవాడి తండ్రికి చెప్పాడు. కుర్రవాడి తలబిరుసుతనాన్ని కాస్త అదుపులో పెట్టమనీ, సత్ప్రవర్తన అలవరచుకునేలా క్రమశిక్షణతో పెంచమనీ, అబ్బాయి తండ్రికిసలహా ఇచ్చాడు. అయితే ఆ కుర్రవాడి తండ్రి, అంతా మౌనంగా విని, ఉపాధ్యాయుణ్ణిఒకసారి పరిశీలనగా చూసి, "వాడు శనక్కాయలు తినలేదని చెప్పాడంటే, అది నిజమే అయివుంటుంది. వాడు అబద్ధాలాడడు," అన్నాడు.

నిజం కోసం, హక్కుల కోసం పోరాడాలంటే దానికెంతో గుండెనిబ్బరం, ఆత్మవిశ్వాసం కావాలి. చిన్నప్పుడే అంత ధైర్యాన్ని ప్రదర్శించిన ధీశాలి వేరెవరో కాదు. స్వాతంత్ర్యోద్యమ నాయకులలో ముఖ్యుడుగా, "స్వతంత్రం నా జన్మహక్కు! దానిని సాధించి తీరుతాను," అనేనినాదంతో ప్రజలకుస్ఫూర్తి నందించిన లోకమాన్య బాలగంగాధర తిలక్!





# తెల్లగడ్డం నల్లసాధువు

చింతలపల్లె అనే గ్రామంలో వుండే రాజయ్య తండ్రి వీరయ్య, గ్రామంలోని పెద్దరైతుల్లో ఒకడైన భూపతిగారింటి పాలేరు. చిన్నతనం లోనే తల్లిని పోగొట్టుకున్న కొడుకు రాజయ్య అంటే వీరయ్యకు పంచప్రాణాలు. రాజయ్యకు చదువుపట్ల ఎంతో శ్రద్ధ వుండేది.

అయితే, భూపతిగారి భార్య భానుమతికి వీరయ్య ఆలోచనలు నచ్చలేదు. బాగా చదువుకుంటే, తండ్రి తదనంతరం రాజయ్య తమ ఇంట పనిచేయడని భయపడి, ఆమె ఒకనాడు వీరయ్యతో, "నీ కొడుక్కు పదేళ్ళు వచ్చాయిగదా! ఇప్పుడు వాడు ఇంటిపనులు చేయగలడు. ఇకమీదట నువ్వు మేం కొత్తగా కొన్న మామిడితోట పని చూసుకో. తోటలోని గుడిసెలోనే మీ ఇద్దరూ హాయిగా వుండండి," అన్నది.

"రాజయ్యను బాగా చదివించాలని నా ఆశ, అమ్మగారూ!" అన్నాడు వీరయ్య. చేతులు నలుపుకుంటూ.

ఆ జవాబు వింటూనే భానుమతి తీవ్ర స్వరంతో, "ఓరి, నీ దురాశ పాడుగానూ! ఛీ, చదువు కూడు పెడుతుందా గుడ్డ పెడుతుందా? గుర్తుపెట్టుకో, నీ కొడుకు పాతికేళ్ళ వయసు వచ్చేవరకూ చేసిన పాలేరుపనికి గాను జీతం పక్కన వేసి, అప్పుడు ఒకేసారిగా ఇస్తాను. ఆ మొత్తం మీద వచ్చే వడ్డీ డబ్బులతో వాడు జీవితాంతం కాలుమీద కాలు వేసుకుని మహరాజులా బతకవచ్చు. చదువూ గిదువూ అంటూ పిచ్చి ఆలోచనలు మాను!" అంటూ గట్టిగా హెచ్చరించింది.

ఇక చేసేదిలేక కొడుకు రాజయ్యను, భూపతిగారింట పాలేరుగాపెట్టి, తను భార్యతో

మాచిరాజు కామేశ్వరరావు

కలిసి మామిడితోట పని చూసుకోసాగాడు వీరయ్య.

కొన్నేళ్ళు గడిచాయి. హఠాత్తుగా ఏదో తీవ్రమైన వ్యాధికి గురై, వారం తిరక్కుండానే వీరయ్య చనిపోయాడు. భానుమతి ఆ మరుసటి సంవత్సరం రాజయ్యకు పెళ్ళిచేసి, అతడి భార్య చుక్కమ్మను తమ ఇంటిపనికి పెట్టుకుని, రాజయ్యకు పూర్తిగా తోటపని అప్పగించింది.

మరొక ఆరు సంవత్సరాలు గడిచాయి. రాజయ్యకు ఒకే సంతానం రంగడు. వాడు మహాచురుకైనవాడు. గ్రామ పాఠశాలలో అన్నిటా ప్రథముడుగా వుండేవాడు. వాడి తెలివితేటలు చూసి రాజయ్య, భార్యతో, "నేనెలాగూ చదువుకోలేక పోయాను. మన రంగడినన్నా బాగా చదివించాలి. వాడికి నా పాలేరుతనం వారసత్వం కాకూడదు!" అన్నాడు.

అందుకు చుక్కమ్మ ఎంతో విచారంగా, "నీ ఆలోచన బాగానేవుంది. కానీ, మనకిప్పు డొస్తున్న జీతండబ్బు తిండికే బొటాబొటీగా సరిపోతున్నది. దమ్మిడీ మిగల్చలేకపోతు న్నాం. ఇక అబ్బాయినెలా చదివించగలం?" అని అడిగింది.

రాజయ్య కాసేపు ఆలోచించి, "భూపతి దొర ఇంటి పెత్తనమంతా అమ్మగారిది. నా పదోయేట నుంచి వాళ్ళ ఇంట్లో పాలేరుగా పనిచేశాను. నాకు పాతికేళ్ళ వయసు వచ్చాక, ఆనాటివరకూ ఇవ్వవలసిన జీతం డబ్బు, ఒకే సారి ఇస్తామన్నారు. ఆ డబ్బు ఇప్పటికి ఎంత కాదన్నా పదివేల వరకూ పోగుపడి వుంటుంది. ఆ డబ్బుతో నేను పట్నంలో ఏదైనా చిన్న వ్యాపా



రంమొదలు పెడతాను. అక్కడయితే రంగడు కొన్నాళ్ళ తర్వాత పెద్దచదువులు కూడా చదువు కోగలడు, ఏమంటావు?" అని అడిగాడు.

చుక్కమ్మ సరేనన్నట్టు సంతోషంగా తల ఊపింది.

తన నిర్ణయం గురించి రాజయ్య, భాను మతితో చెప్పేందుకు వెళ్ళినప్పుడు, భూపతి కూడా అక్కడే వున్నాడు. అతడు చెప్పినదంతా విన్న భానుమతి, "మీ నాన్నకూ ఇలాంటి అర్థం పర్థంలేని ఆశే వుండేది. పిల్లి కడుపున పిల్లే పుడుతుంది; పాలేరు కడుపున పాలేరే పుడతాడు! సరే, ఇంతకూ నీ తాలూకు డబ్బు, మా దగ్గర ఒక్క కానీ కూడా లేదు. అదంతా ఏనాడో మీ నాన్న తీసుకున్నాడు," అన్నది నిర్మొహమాటంగా. జరిగినదంతా తెలిసిన భూపతి కూడా భార్య నోటికి భయపడి మౌనంగా ఉండిపోయాడు.



రాజయ్య మారుమాట్లాడకుండా, తన గుడిసెకు తిరిగి వచ్చాడు. ఆ రాత్రి ఉరుములూ, మెరుపులతో పెద్దగాలివాన వచ్చింది. మంచి కాపుమీద వున్న మామిడితోట ఏమయిందో అని ఆందోళనపడ్డారు, రాత్రంగా భూపతీ, భానుమతీ.

తెలతెలవారుతూండగా ఇద్దరూ గుర్రపు బండిలో మామిడితోటకు వెళ్ళారు. గుడిసెలో రంగడిని పక్కన కూర్చోపెట్టుకుని చుక్కమ్మ ఒక్కతే వున్నది. తోటలో చెల్లాచెదురుగా రాలిన మామిడికాయలను చూసి భానుమతి బాధపడుతూ, ''చుక్కా, నీమొగుడెక్కడ? నువ్వింకా ఇంటిపనికి రాలేదేం?'' అని అడిగింది కోపంగా.

చుక్కమ్మ బెదురు బెదురుగా, ''రాత్రి ఒక విచిత్రం జరిగిందమ్మగారూ! గాలివాన సమయంలో ఎవరో మా గుడిసె తలుపు కొట్టారు. ఈ సమయంలో ఎవరా అని మా ఆయన లాంతరు పట్టుకుని వెళ్ళి తలుపు తెరిచాడు. ఎదురుగా పొడవాటి తెల్లటి గడ్డంతో వున్న నల్లటి సాధువు కనిపించాడు. ఆయన వర్షంలో బాగా తడిసి ముద్దయి వున్నాడు.

''ఆకలి దహించుకుపోతున్నది. తినడానికేమైనా పెడతారా? ఏదో గుప్పెడన్నం, ఉంటే కాస్త మజ్జిగా చాలు,'' అన్నాడు సాధువు, వణుకుతున్న గొంతుతో.

''అమ్మగారూ! ఆ సాధువేదో మహత్తున్నవాడు. ఆయన అడిగినట్టుగానే సత్తు పాత్రలో కాస్త అన్నం వున్నది. పీట వేసి ఆయన కూర్చోగానే, పళ్ళెంలో ఆ అన్నం పెట్టి, లోటాలో మజ్జిగ పోసి ఇచ్చాం. ఆయన ఆవురావురంటూ తిని, ఏమాటా మంతీ లేకుండా అంత వానలోనూ బయటికివెళ్ళిపోయాడు. తర్వాత చూస్తే - ఆ పళ్ళెం, లోటా లాంతరు వెలుగులో ధగధగా మెరుస్తున్నవి. అవి సాధువు అంటుకోవడంవల్ల బంగారంగా మారినవని చెప్పి, నా మొగుడు ఇంకా చీకటి వుండగానే పట్నం బయల్దేరి వెళ్ళాడు. వాటినమ్మి అక్కడే ఏదైనా వ్యాపారం చేస్తాడట!'' అన్నది చుక్కమ్మ, రంగణ్ణి మురిపెంగా దగ్గరకు తీసుకుంటూ.

తమ పాలేళ్ళకు పట్టిన అదృష్టానికి భానుమతి అసూయతో రగిలిపోయింది. ఏమీ మాట్లాడకుండా చుక్కమ్మకేసి ఒకసారి చిరాగ్గా చూసి, భర్తతో కలిసి ఇంటికి వెళ్ళిపోయింది.

ఆ రోజు కూడా సూర్యాస్తమయమవుతూనే గాలివాన ప్రారంభమైంది. రాత్రి పది

గంటల వేళ భూపతి గాఢనిద్రలో వున్నాడు. గాలికి చప్పుడు చేస్తున్న వీధి కిటికీ తలుపులు మూయడానికి వెళ్ళింది, భానుమతి. మెరుపు వెలుగులో కిటికీగుండా, ఇంటి ముందు నిల బడివున్న తెల్లగడ్డం నల్లసాధువును చూసి, ఆమె తన కళ్ళను తానే నమ్మలేకపోయింది.

ఆమె చప్పున తలుపు తీసి, ''లోపలికి రండి, స్వామీ! వర్షంలో తడిసిపోతున్నారు,'' అంటూ సాధువును ఆహ్వానించింది.

సాధువు లోపలికి వస్తూనే, ''ఆకలి దహించుకుపోతున్నది, తల్లీ!'' అన్నాడు వినీవినపడని గొంతుతో.

ఆ వెంటనే భానుమతి, అతడికి పొడిబట్ట లిచ్చి, ఒక గుండ్రటి బల్లముందు కూర్చో వలసిందిగా కోరి, వంట గదిలోంచి అన్నం కూరలూ తెచ్చి, రెండు పెద్ద కంచుపళ్ళాల్లో వాటిని పెట్టి, ఒక పెద్ద రాగి లోటాతో మంచి నీళ్ళిచ్చింది.

సాధువు భోజనం పూర్తిచేసి, ''అన్నపూర్ణలా మంచి భోజనం పెట్టి ప్రాణం నిలిపావు, తల్లీ!'' అంటూ వెళ్ళడానికి వాకిలికేసి చూశాడు.

ఐతే, భానుమతి, ''స్వామీ! ఇంత వానలో ఎక్కడికి వెళతారు. ఆ భోషాణం మీద విశ్ర మించండి. తెల్లవారాక వెళ్ళవచ్చు,'' అన్నది ప్రాథేయపడుతున్నట్టు.

సాధువు చిరునవ్వు నవ్వుతూ వెళ్ళి ఇనపభోషాణం మీద పడుకున్నాడు. భాను మతి సంతోషంగా తన పడకగదిలోకి వెళ్ళి పోయింది.

బాగా పొద్దిపోయి పడుకోవడంతో, భాను మతి నిద్రలేచేసరికి బాగా తెల్లవారిపోయింది. ఆమె మంచం మీది నుంచి లేస్తూనే చరచరా సాధువు రాత్రి పడుకున్న భోషాణం గదిలోకి వెళ్ళింది. కానీ, అక్కడ సాధువు లేడు. ఇనప భోషాణం మొత్తం బంగారంగా మారిందేమో అని, ఆమె అక్కడికి వెళ్ళింది. భోషాణంలో ఎలాంటి మార్పూ లేదు; కానీ దాని తలుపు పూర్తిగా తెరిచి వున్నది. అది చూస్తూనే కెవ్వు మంటూ అరిచింది, భానుమతి.



తర్వాత ఆమె భోషాణం దగ్గరకు పోతూ, "దొంగ సాధువును, మహత్తుగల సాధువని భ్రమించి ఇంట్లోకి పిలిచి కడుపునిండా తిండి పెట్టాను. వాడు మొత్తం భోషాణంలోని నగలూ, బంగారపు కాసులూ ఎత్తుకుపోయాడు! నా బంగారమంతా పోయింది. కూడబెట్టిన బంగారమంతా పోయింది," అంటూ, భోషాణంలోకి తొంగిచూడడానికి కాళ్ళూ చేతులూ స్వాధీనంలోకి రాక, మరొకసారి కెవ్వుమంటూ అరిచి కుప్పకూలిపోయింది.

భార్య కేకలు విని భూపతి అక్కడికివచ్చాడు. భానుమతి, "డబ్బూ, దొంగసాధువు!" అంటూ పలవరిస్తున్నది. ఆయన చప్పున పోయి భోషాణంలోకి పరీక్షగా చూశాడు. అందులో ఉండవలసిన నగలూ, ఇతరత్రా విలువైన వస్తువులూ చెక్కుచెదరకుండా వున్నవి. కానీ, పాతికేళ్ళ తర్వాత వీరయ్యకు పాలేరు పనికిగాను ఇస్తానంటూ, ఆమె దాస్తూవచ్చిన డబ్బు సంచీ మాత్రం లేదు!

ఇది చూస్తూనే, ఆ వచ్చిన సాధువెవరో భూపతికి తెలిసిపోయింది. వీరయ్య భోషాణంలో వున్న, తనకు రావలసిన డబ్బు సంచీ మాత్రమే తీసుకుపోయాడన్నమాట! పాలేరు నిజాయితీ ఆయనకు ఆశ్చర్యంతోపాటు చాలా సంతోషం కలిగించింది.

ఆయన,ఆప్యాయంగా భానుమతి భుజం తడుతూ, "మన డబ్బు ఎక్కడికీ పోలేదు, భయపడకు. లేచి కూర్చో!" అన్నాడు.

భానుమతి లేచి కూర్చునే స్థితిలో లేదు. వినీ వినబడనట్టు ఇంకా ఏదో పలవరిస్తూనే వున్నది. భూపతి అప్పటికప్పుడు కబురు చేసి వైద్యుణ్ణి పిలిపించాడు. వైద్యుడు, భానుమతిని రకరకాలుగా పరీక్షించి, "ఈమెగారు హఠాత్తుగా ఏదో మనోవ్యధకు గురైంది. ఐదారు నెలల పాటు ఎలాంటి మానసికమైన ఒత్తిడీ కలగకుండా జాగ్రత్తపడండి. నేను తగు చికిత్స చేస్తాను," అంటూ భూపతికి ధైర్యం చెప్పాడు.

ఆరు నెలలు గడిచినా భానుమతి మానసిక భ్రాంతి నుంచి కోలుకోలేదు. "నా బంగారం పోయింది, బంగారం పోయింది!" అంటూ పలవరించడం మానలేదు.

ఈ దురదృష్ట సంఘటన జరిగాక భూపతి బాగా ఆలోచించి, గ్రామపెద్దలతో సంప్రదించి, తన డబ్బుతో గ్రామంలో పేదవిద్యార్థుల కోసం ఉచిత పాఠశాలను ఏర్పాటుచేశాడు.





# మూడు కాన్ల పుణ్యం

ఒక గ్రామంలో సుబ్బిశెట్టి అనే వ్యాపారస్థుడు ఉండేవాడు. అతని ప్రాణానికీ డబ్బుకీ లంకె. అతని భార్య మీనాక్షికి భర్త పిసినారితనం నచ్చేది కాదు, కాని భర్త బుద్ధి తెలిసి, సాధ్యమైనంత వరకు డబ్బు ఖర్చు చేసేది కాదు. అయితే ఆమె ధర్మకార్యం ఏదైనా చెయ్యదలచినప్పుడు భర్త చేత పట్టుబట్టి ఖర్చు చేయించేది.

అనుభవించటానికి బోలెడంత డబ్బు ఉండి కూడా, శెట్టి దంపతులకు సంతానం లేకపోవటం తీరని లోటుగా ఉండేది. పిల్లల కోసం మీనాక్షి చాలా దేవుళ్ళకు మొక్కింది. పూజలూ, పుణ్యాలూ చేసింది. వాటికి శెట్టి అభ్యంతరం చెప్పలేదు. కాని అవేవీ ఫలించలేదు. చివరకు మీనాక్షి, ప్రాణం విసిగి, తనకు సంతానం కలిగితే దేవుడికి నిలువుదోపిడీ ఇస్తాననీ, తన భర్తకు వ్యాపారంలో ఒక ఏడు వచ్చినలాభంలో పైసా వాటా హుండీలో వేస్తాననీ మొక్కింది.

మీనాక్షి ఇలా మొక్కుకున్న కొద్ది రోజులకు గర్భం ధరించి, కాలక్రమాన పిల్లవాణ్ణి కన్నది. ఆ తరవాత ఆమె ఎంతో సంతోషంగా శెట్టికి తను దేవుడికి మొక్కుకున్న మాట చెప్పింది.

శెట్టిఅదిరిపడి, "నీకేమైనా మతి పోయిందా? నిలువు దోపిడీ అంటే ఎంత లేదన్నా రెండు మూడు వేలు ఉంటుంది. ఆ పైన లాభంలో పైసా వాటా అంటే ఏమిటనుకున్నావు? మళ్ళీ నావద్ద అమాట ఎత్తకు," అన్నాడు.

మీనాక్షి నడుము బిగించి, "ఇదుగో, ఈ విషయంలో మాత్రం నువ్వు కాదనటానికి వీల్లేదు. ఇది దేవుడితో కూడిన వ్యవహారం. బిడ్డకేదన్నా అనర్థం జరిగిందో, నా శవం కళ్ళజూస్తావు!" అన్నది కోపంగా.

శెట్టి మారు మాటాడక అంగీకరించాడు. దేవుడు కోపిష్ఠి అని అతనికి లోలోపల భయం ఉన్నది.

"ఈసారికి నీ మొక్కు చెల్లిస్తాగాని, ఇంకెన్నడూ డబ్బుతో కూడిన మొక్కులు మొక్కుకోకు," అన్నాడతను.

"నాకు తెలీదా?" అన్నది మీనాక్షి.

కొద్దిరోజుల అనంతరం శెట్టి భార్యతోనూ, బిడ్డతోనూ దేవుడి దగ్గిరికి ప్రయాణమయ్యాడు. మీనాక్షి నిలువుదోపిడీకి అవసరమైన నగలు



ధరించింది. లాభంలో పైసా వంతున దేవుడికి చెల్లించవలసినది వెయ్యి రూపాయలని శెట్టి లెక్కతేల్చాడు.

"లెక్కల విషయంలో పొరపాటు చెయ్యవద్దు," అని మీనాక్షి అతన్ని హెచ్చరించింది.

దారి ఖర్చులకు మరో వెయ్యి చేత బుచ్చుకుని శెట్టి ప్రయాణమయ్యాడు. ఇంటికి తాళం పెడుతుండగా శెట్టికి వీధి అరుగు మీద తిష్ఠ వేసిన ఒక బైరాగి కనిపించాడు.

"శుభమా అని ప్రయాణం అవుతూండగా, ముందు ఈ బైరాగి వెధవ తారసిల్లాడేమిటి?" అని శెట్టి వాణ్ణి తిట్టుకున్నాడు.

శెట్టితో బైరాగి, "అయ్యా, పుణ్య క్షేత్రాలకు వెళ్ళేటప్పుడు దానధర్మాలు చేసి బయలుదేరాలి. రాత్రి నుంచీ తిండి లేదు. ఏమైనా ఉంటే పెట్టించండి," అన్నాడు.

"ఆపవయ్యా! నీ బోడి హితబోధ ఎవడికి కావాలి? నీ బోడి మూడు కాన్లపుణ్యం నాకేమీ అక్కర్లేదు. వేల రూపాయలు ధారపోసి, దేవుడి నుంచి బోలెడంత పుణ్యం సంపాదించుకోబోతున్నాను," అన్నాడు శెట్టి ధీమాగా.

శెట్టి మాటలు విని మీనాక్షి చీదరించుకున్నది. ముందు పోతున్న భర్త చూడకుండా సంచీలో నుంచి రెండు లడ్డూలు తీసి బైరాగి బొచ్చెలో పడవేసి, రొండి నుంచి మూడు కాన్లు చిల్లరడబ్బులు తీసి ఇచ్చింది.

మీనాక్షి బైరాగికి డబ్బులివ్వటం శెట్టి చూడనే చూశాడు. ఆయన మీనాక్షి మీద మండిపడుతూ, "డబ్బంతా ఇక్కడే ఖర్చు పెడుతున్నావు. వచ్చేటప్పుడు అడుక్కు తింటూ రావాలి, తెలిసిందా?" అన్నాడు.

"పోనీలెండి! పాపం పొద్దుటనగా వచ్చి కూర్చున్నాడు. పెట్టకపోయినా, మూడు కాన్లు చిల్లర ఉంటే ఇచ్చాను," అన్నది మీనాక్షి.

పుణ్యక్షేత్రం చేరగానే కోనేట్లో స్నానం చేసి, ఆలయంలోకి వెళ్ళబోతూ శెట్టి మీనాక్షి చేతికి వెయ్యి రూపాయలు ఇస్తూ, "నా దగ్గిర మరో వెయ్యి ఉన్నది. ఒక వెయ్యి హుండీలో వేసి, రెండోది మనదారి ఖర్చుల కోసం ఉంచుదాం," అన్నాడు. "అలాగే," అన్నది మీనాక్షి.

దైవదర్శనం అప్పుడు మీనాక్షి నిలువు దోపిడీతో పాటు భర్త ఇచ్చిన వెయ్యి రూపాయలూ హుండీలో వేసింది. ఈ సంగతి తెలియక శెట్టి తన వద్ద ఉన్న వెయ్యి రూపాయలు కూడా హుండీలో వేశాడు. ఇద్దరూ బయటకొచ్చిన తరవాత శెట్టి మీనాక్షితో, "డబ్బు జాగ్రత్త సుమా! అంతా దొంగలే!" అన్నాడు.

"డబ్బు మీ దగ్గర ఉంచుకుని నన్ను జాగ్రత్త అంటారేమిటి?" అన్నది మీనాక్షి ఆశ్చర్యపోతూ.

వెంటనే జరిగిన పొరపాటు తెలిసిపోయింది. శెట్టి ఆలయం అధికారుల ద్వారా, పొర పాటున హుండీలో వేసిన అదనపు వెయ్యి తిరిగి సంపాదించుకోవాలని చూశాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

మీనాక్షి అతనితో, "మీరేదో అపచారం చేశారు. లాభాల్లో దేవుడికివ్వవలసిన వాటిలో దొంగలెక్కలుగానీ వెయ్యలేదు గదా?" అన్నది.

శెట్టి తలదించుకున్నాడు.

ఇద్దరి వద్దా మిగిలిన చిల్లర ఒకరోజు ఖర్చుకు కూడా చాలదు. దారిలో ఉపవాసాలు చేస్తూ, అవకాశం వున్నప్పుడు యాచిస్తూ అష్ట కష్టాలూ పడి, వాళ్ళు ఇల్లు చేరారు. చాలా రోజులకు తిరిగి వచ్చిన శెట్టిని చూడటానికి అనేకమంది వచ్చారు. చిత్రమేమిటంటే, వాళ్ళు బయలుదేరేటప్పుడు కనిపించిన బైరాగి ఇంకా అక్కడే వున్నాడు.

ఆ బైరాగి శెట్టికి ఎదురు వచ్చి, "అయ్యా, ప్రయాణం బాగా సాగిందా?" అని అడిగాడు. శెట్టి చిరాకుగా, "ఆ, ఆ! బాగానే సాగింది. దారి పొడుగునా అడుక్కుతింటూ వచ్చాం. సరేనా?" అన్నాడు.

"అది మీరు వెళ్ళేముందు అన్న మాటేగా? వస్తా!" అంటూ బైరాగి అక్కడినుంచి కదిలాడు.

"తనకు మాలిన ధర్మం చేసినందుకు ఆ బైరాగి వాడికి బాగా అయింది!" అన్నది ఒకావిడ.

"ఎందుకు అలా అన్నారు?" అని శెట్టి ఆమెను అడిగాడు.

"ఎందుకా? మీరు వెళ్ళిన దగ్గర నుంచీ ఆ బైరాగి మీ ఇంటికి కుక్క కాపలా కాచాడు. మొన్న రాత్రి మీ ఇంట్లో దొంగలు పడబోతున్నప్పుడు బైరాగి చూసి, కేకలు పెట్టి నలుగురినీ పిలిచాడు. దొంగలు భయపడి పారిపోయారు. మీరేమో ఆ బైరాగిని దొంగను చూసినట్టు చూస్తున్నారాయె!" అన్నదామె.

"మూడు కాన్ల బోడి పుణ్యం మన సర్వస్వాన్నీ కాపాడింది," అన్నది మీనాక్షి భర్త ముఖంలోకి చూసి.

శెట్టి తన అవివేకానికి చాలా సిగ్గు పడ్డాడు. ఆ తరవాత ఆయన దానధర్మాలు చెయ్యటం కోసం డబ్బుకు వెనకాడక ఆ ఊళ్ళోనే కాకుండా, ఆ చుట్టుపక్కలా మంచి పేరు తెచ్చుకున్నాడు.



# ఆర్య

అజ్ఞాత యువరాజు
విచిత్ర సాహసగాథ

శాంతిపుర రాజు శాంతిదేవుడు, తనకు వ్యతిరేకంగా కుట్ర జరుగుతున్నదని తెలిసి, బిడ్డతో సహా రాణిని రహస్య సొరంగమార్గం గుండా తప్పించుకోమని ఆదేశించాడు. ఆ తరవాత తిరిగివచ్చి, సేనాధిపతి అనుచరులతో పోరాడుతూ రాజభవనాన్ని ఆనుకుని ప్రవహిస్తున్న నదిలోకి దూకేశాడు. రాణి మెల్లగా ప్రయాణం చేసి సొరంగం నుంచి బయటకు వచ్చి స్పృహతప్పి పడిపోయింది. బిడ్డ జయానంద ముని కంటబడడంతో ఆయన ఆశ్చర్య పోతూ ఎత్తుకున్నాడు.

చిత్రాలు: గాంధి అయ్య

జయానందుడు బిడ్డ తల్లిదండ్రులను ఎక్కడ వెదకడమా అని ఆలోచిస్తూండగా, ముకుందుడనే తన శిష్యుడు అటుకేసి రావడం గమనించాడు.

గురూజీ! ఎవరో ఒక స్త్రీ నదీతీరంలో స్పృహతప్పి పడివున్నది.

బహుశా, ఆమె ఈ బిడ్డ తల్లి అయివుంటుంది. పద వెళ్ళి చూద్దాం!

అదిగో, అక్కడ ఉన్నది!

వెళ్ళి, కొద్దిగా నీళ్ళు పట్టుకురా. నా కమండలం తీసుకువెళ్ళు.

ముకుందుడు వెళ్ళి నీళ్ళు తెచ్చి ఆమె ముఖం మీద చల్లాడు.

త్వరలోనే ఆమెకు స్పృహ రావచ్చు!

ఆ స్త్రీ కళ్ళు తెరిచి బిడ్డను చూడగానే చిన్నగా నవ్వింది.

ఎవరు బిడ్డా నువ్వు?


అమ్మా
ఈ దుప్పటి
ద తలపెట్టి
పడుకో!


హాత్మా!
తమరు నన్ను
'బిడ్డా' అని
పిలిచారు.
ప్రస్తుతానికి నేను
తమ బిడ్డగానే
ఉండిపోతాను.


ఈ బిడ్డకు రక్షణ కల్పించి,
పెంచి పెద్ద చేసే బాధ్యత
తమది! నేను బతకనను
కుంటాను....


ముని ఆమెకు
బదులు పలికేలోగా,
ఆమె బిడ్డను మరొక
సారి ఆప్యాయంగా
చూసి,
కన్నుమూసింది!
గురూజీ! ఆమె
మరణించింది!
ఔను, ముకుందా,
ఆమె వెళ్ళిపోయింది!




జయానందుడు వెళ్ళి జలపాతంలో స్నానం చేశాడు. ఆ తరవాత ధ్యానంలో కూర్చున్నాడు. అప్పుడాయనకు ఒక స్త్రీ కనిపించింది.






ముని ధ్యానం ముగించి, ముకుందుడి దగ్గరికి వెళ్ళాడు. ఆ లోగా అక్కడికి ఇంకొక శిష్యుడు కూడా వచ్చి ఉన్నాడు.










ముకుందా, నీ ఊహ సరైనదే! వాళ్ళు అక్కడి నుంచి ఎలా తప్పించుకుని వచ్చారో అర్థం కావడంలేదు. మహారాణి శాంతకుమారి, తన శరీరాన్ని భూస్థాపితం చేసే ముందు, తన బిడ్డ చేత ఒక తెల్ల పుష్పాన్ని తన భౌతికకాయంమీద ఉంచేలా చేయమని కోరింది.


గురూజీ! మహారాజు తమ భవనాన్ని అనుకుని ప్రవహిస్తూన్న నదిలోకి దూకేశాడని కొందరంటున్నారు. మరికొందరేమో సేనాధిపతి రాజుగారిని హత్యచేశాడని చెప్పుకుంటున్నారు.
యువరాజు క్షేమం కోసం రాజకుటుంబానికి సంబంధించిన సమాచారాన్ని మన ముగ్గురి మధ్యే ఉంచుదాం. రాజుగారు తప్పించుకుని ఉండవచ్చు! ఏం జరిగిందో ఎవరికి తెలుసు?
గురూజీ! మనం ఇప్పుడు రాణిగారి భౌతిక కాయాన్ని భూస్థాపితం చేద్దామా?


రేపు అలాగే చేద్దాం. ఈ రాత్రికి ఆమె భౌతికకాయాన్ని కాపలా కాయమని మన బాఘూ, బాఘీలకు చెబుతాను.
(ఇంకావుంది)

# వినోద సమయం

అందమైన అడవి దృశ్యం ఇక్కడ ఉంది. ఇందులో వినోదం కూడా ఎంతో ఉంది. మీ పెన్సిల్ బాక్స్ తీసుకోండి మరి!

## 1. రంగులు వేయండి

ఫ్రెడీ కప్ప హాయిగా వాహ్యాళికి బయలుదేరింది. దీనికి రంగులు వేసి వాహ్యాళిని మరింత ఆసక్తికరం చేయండి.

## 2. లిండాకు దారి చూపండి

తన చెల్లెలు చెట్టు తొర్రలో చిక్కుకుపోవడంతో లిండా పక్షి మరీ విచారపడిపోతోంది. ఈ చిక్కుదారిగుండా దానికి దారి చూపి కాస్త సాయపడండి. అది మధ్యలో ఉన్న కీటకాన్ని తప్పించుకోవాలన్న సంగతి గుర్తుంచుకోండి!




3. తేడా గల దానిని వెలికి తీయండి
ఇక్కడున్న గొంగళిపురుగు చాలా ఆకులను తినేసింది. తను తిన్న ఒక్కొక్క ఆకులోనూ నిర్దిష్ట ఆకారాన్ని వదిలింది. అయితే ఒకటి మాత్రం భిన్నంగా కనిపిస్తోంది. తేడా వున్నదానిని వెలికి తీయండి చూద్దాం.
4
b
a
4. పట్టుకోండి చూద్దాం!
ఇక్కడున్న పువ్వుల్లో ఒక కీటకం దాగి వుంది. పట్టుకోగలరా?
A
3
B
C
D
(సమాధానాలు 66వ పేజీలో)
2

# ఫోటో వ్యాఖ్యల పోటీ



ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని,
చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా?
రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


VICKY MANOHAR


SOURAA

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు నవంబర్ 2003 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

అభినందనలు

## ఆగస్ట్ నెల పోటీ ఫలితాలు

భాస్కరుని వెంకట దుర్గా ప్రసాద్
S/o బి. నాగేశ్వరరావు
5-61, నందివెలుగు (పోస్ట్)
తెనాలి మండలం - 522 306
గుంటూరు జిల్లా (ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: రూపాయితో ముడిపడిన జీవనం!
రెండవ ఫోటో: స్వయం ఉపాధితో సాగాలి పయనం!

వినోద సమయం సమాధానాలు (పేజీ 64-65)

3. తేడా కలిగినది
(D) భిన్నంగా వుంది.

4. పట్టుకోండి చూద్దాం!
(B) పువ్వులో కీటకం దాగి వుంది.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

